# పొరుగింటి పుల్లకూర

[నాటకం]

*

రచన :

పోకల నరసింహారావు

సాహితీ స్రవంతి, పాలకొల్లు

# నాటకంలోని పాత్రలు

| | | |
|---|---|---|
| ఆ యింటి యజమాని | ... | పురుషోత్తం |
| ఆ యజమానిగారి అమ్మాయి | ... | రాణి |
| ఆ అమ్మాయిగారి బావగారు | ... | గిరి |
| ఆ వూరి పోస్టు మాస్టారు | ... | ముత్యాలరావు |
| ఆ వూరికి పొరుగూరునుంచి విచ్చేసిన పెద్దమనిషి | ... | చిదానందం |

1959 సం॥ నర్సాపురం నాటక కళాపరిషత్తు

పోటీలో పాల్గొంది



అప్పుడు పాల్గొన్నవారు

| | | |
|---|---|---|
| పురుషోత్తం | : | దేవళ్ల ఆదినారాయణ |
| రాణి | : | K. S. మణికుమారి |
| గిరి | : | తూతిక సూర్యనారాయణ |
| ముత్యాలరావు | : | పోకల నరసింహారావు |
| చిదానందం | : | వాకాడ ఆదినారాయణ |
| మ్యూజిక్ | : | తాళాబత్తుల సత్యం |
| మేకప్ | : | శేషుబాబు |
| ప్రైక్సు | : | జాన నాగేశ్వరరావు |

స్టేజి నిర్వహణ :

ఆంజనేయులు, G. H. భాస్కరరావు, తాళాబత్తుల గాంధి

మూడడ్ల అప్పారావు, వుంగరాల పద్మనాభం,

ప్రదర్శకులు :

రాఘవ కళానిలయం, పాలకొల్లు.

"పొరుగింటి పుల్లకూర" నాటకంలో ఒక దృశ్యం



మణికుమారి, దేవళ్ల ఆదినారాయణ, పోకల నరసింహారావు.

తూతిక సూర్యనారాయణ, వాకాడ ఆదినారాయణ.



1959 సం॥ నర్సాపురం నాటక కళాపరిషత్తు పోటీలో

రచనకు ప్రత్యేక బహుమతి 116 రూపాయలు

ఉత్తమ నటనకు షీల్డు శ్రీమతి మణికుమారి

నటనకు ప్రత్యేక బహుమతులు

శ్రీ పోకల నరసింహారావు, శ్రీ తూతిక సూర్యనారాయణలు

అందుకున్నారు

## అభివందనములు

ఈ నాటక విజయానికి సలహాలు యిచ్చి
నన్ను సర్వ విధాల ప్రోత్సహించిన
నా చిరకాల రాజకీయ మిత్రుడు
నాటక రచనలో నా సహచరుడు
శ్రీ పరకాల శేషావతారంకు

రచయిత

"పొరుగింటి పుల్లకూర" నాటకం ప్రదర్శించదలచేవారు ముందుగా నా అనుమతి పొందాలి. ప్రదర్శనకు 15 రూపాయలు M. O. ద్వారా పంపినయెడల అనుమతి పొందగలరు.

ఇట్లు,

పోకల నరసింహారావు

# 1వ రంగం.

(పురుషోత్తంగారి యింటిలోని చావిడిభాగం. వీధిలోకి, యింటిలోకి, గిరి, రాణి, పురుషొత్తంగార్ల గదులలోకి గుమ్మాలున్నాయి. చావిడి మధ్య ఒకసోఫా, దానికెదురుగా టీ డ్రాయరు, గోడకు తైలవర్ణ చిత్రాలు, పెద్ద షీట్ కేలెండరు గోడవార డ్రాయరు, నీళ్లకూజా కూడావున్నాయి)

రాణి : (ఇంటిలోనుంచి వచ్చింది. జడలో రిబ్బను అల్లుకొంటోంది.) బావా! బావా! (గిరి గదిలోకివెళ్లి తిరిగివచ్చి తండ్రిగదిలోకి వెళ్తూ) నాన్నా! నాన్నా! (వెళ్లింది. తిరిగి వచ్చింది. వీధి గుమ్మంవరకూ వెళ్లిచూచి తిరిగివచ్చింది. తనగదిలోకి వెళ్ళిపోయింది)

ముత్యా : (బయటనుంచి పట్టలేనిసంతోషంతో వచ్చాడు.) పురుషోత్తంగారూ! ఓ పురుషోత్తంగారూ! ఏమండోయ్ పురుషోత్తంగారూ! యింతకీ ఇంట్లో వున్నారా? ఎక్కడా అలికిడి లేదేం?

రాణి : (తనగదిలోంచి వస్తూ) ఎవరూ? ముత్యాలుగారా! ఏమైనా అర్జంటు ఉత్తరాలు వచ్చాయేమాండి ముత్యాలుగారూ?

ముత్యా : ఉఁ. ముత్యాలుగారూ! ముత్యాలుగారూ! అమ్మాయ్. నాపేరు ముత్యాలుకాదు. ముత్యాలరావు. తెలిసిందా? ఇకనుంచి అలాపిలు.

రాణి : ఇదెప్పటినుంచండోయ్.

ముత్యా : నా బారసాల నాటినుంచీను.

రాణి : నిన్నటివరకు 'ముత్యాలుగారూ' అనే పిలిపించు కున్నారూ! నిన్న యీవేళలో ఏం ఘట్టః మునిగిందండీ?

ముత్యా : ఏదోమునిగింది. అయినా నాపేరు ముత్యాలరావు. అవునా?

రాణి : కావచ్చు.

ముత్యా : కాబట్టే పిలు.

రాణి : ముత్యాలుగారూ! ఆహాఁ హా ముత్యాలరావుగారూ పిల్చానండి.

ముత్యా : ఓయ్! పలికానండి!

రాణి : యీ మార్పుకు కారణం శెలవిచ్చారు కాదండి!

ముత్యా : ఏమిటీ ప్రశ్నలు. పెద్దలుచెప్పినట్టు పిల్లలు వినాలి. అంతే.

రాణి : పిల్లలకు కావలసినట్లు పెద్దలు చెప్పాలి.

ముత్యా : అహాఁ. తెలివైనదానివే! కొంటిపిల్ల.

రాణి : కాని చెప్పారు కాదు.

ముత్యా : ఏమిటి?

రాణి : యింతకీ మీరు ముత్యాలుగారా? ముత్యాల రావుగారా?

ముత్యా : మనపేరు ముత్యాలరావు. ఎందుకంటావా? ఉఁ చిన్నపిల్లవు నీకర్థంకాదులే: అయ్యొ నామతిమండ!

ఒకటి చెప్పబోయి మరొకటి చెబుతున్నాను. చూశావా ?

రాణి : వార్ధక్యం కదండీ !

ముత్యా : నిజం అమ్మా నిజం. యిప్పుడు నా వయస్సెం తంటావ్ ?

రాణి : మీరే చెప్పండి.

ముత్యా : ఏభై దాటాయి. అరవయ్యో పడిలో పడింది యీ ఘటం. పెళ్లికెదిగిన కూతురు...

రాణి : నేనెరుగుదును కదండీ శ్యామలని.

ముత్యా : అవును. నీకు తెలుసుగా: నీ యీడుది. నాలు గేళ్లయింది పెద్దమనిషై. యింకా ఒకయ్య చేతిలో పెట్టలేక పోయాను. చేసేదా పోష్టుమాష్టరీ ఉద్యో గం. వచ్చేరాబడా...

రాణి : ( సానుభూతి కలిగింది. ) బహు స్వల్పం.

ముత్యా : కదా అమ్మా ! తాతలు సంపాదించిందా లేదు. రెక్కాడితే డొక్కాడుతుంది. ఎవరి దగ్గరకు వెళ్లినా నాస్థితి నాకు గుర్తుకువస్తుంది. మర్చిపోదామన్నా నాయీ పాతకోటు, అతుకుల చొక్కా, యీ మాసిన కండువా యివి నాయీ దీనస్థితిని నాకుఎల్లప్పుడూ మర్చిపోకుండా జ్ఞాపకం చేస్తాయి. అవుసరమున్నా లేకపోయినా నన్నునేను దీనుడనై న్యూనతపర్చు కోటం ప్రారంభిస్తాను. ఏమైనా ఆశించా ? కాదు.

కూడు లేకపోతే మాడి చస్తాను. కాని యాచించి జీవించలేను. కాని తోటివాళ్ల ముందు తీసికట్టుగా తిరగలేను.

రాణి : ముత్యాలుగారూ ! క్షమించండి. ప్రశ్నించి బాధ పెడుతున్నాను.

ముత్యా : నీకే కాదమ్మా అంతా అంతే. చదువుకునే రోజుల్లో నేను ముత్యాలరావునే. సంసారం మీద పడింది. బాధ్యతలు పెరిగాయి. పిల్లలు పుట్టు కొచ్చారు. ముత్యాలు అయ్యాను. పైగా ఆడ పిల్ల పెళ్ళికి ఎదిగివుంది కదా !

రాణి : చంపేస్తున్నారు ముత్యాలరావుగారూ !

ముత్యా : కాగేపాలు. బాధలు నీకెలా తెలుస్తాయి. నీ కాలాగే అనిపిస్తుంది.

రాణి : అనిపించ నివ్వండి. ( లోనికి వెళ్లుతోంది. )

ముత్యా : అమ్మాయి !

రాణి : ( ఆగింది. )

ముత్యా : నాన్నగారు...

రాణి : లేరు.

ముత్యా : ముత్యాలరావు ముఖ్యంగా వచ్చి వెళ్లాడని చెప్పండీ. ( వెళ్లబోయి ఆగాడు ) ఆఁ. మరచాను. టపాయిదిగో. వస్తాను. అమ్మాయి మర్చిపోకు. ముఖ్యంగా ముత్యాలరావు వచ్చి వెళ్లాడని చెప్పు.

రాణి : ఏ ముత్యాలరావని అడిగితే !

ముత్యా : పోస్టుమాష్టరు ముత్యాలరావని చెప్పు.

రాణి : అలాగే. కాని ముఖ్యంగా ఒకమాట అడగ మంటూరా ?

ముత్యా : అడుగు.

రాణి : మీరు యీవేళ ఏదో కష్టంలో పడ్డారనుకుంటాను.

ముత్యా : (నవ్వాడు) కష్టంలో పడటానికి కారణం ఏమిటో నేటికాలానికి కనుక్కోగలిగాను. నేడొక మహాను భావుడు నాకు కనుపించాడు. బ్రతుకు రహస్యం బయట పెట్టాడు మహానుభావుడు. ఆ జన్మాంతం అతనికి ఋణపడి వుండాలి.

రాణి : ఏమని చెప్పాడో ?

ముత్యా : "నువ్వు మాడిచస్తే. ఎవడికి కావాలి ? బొట్టు పెట్టుకు బజార్లో తిరుగు. నీవొక్కాకెన్ని చిరుగు లుంటే ఎవడుచూచాడు ! కోటేసుకు సీటుగానడు. సిగుప్పెడు ముయ్ ! తెరిస్తే తేలికవుతావ్. లేదో లేదో అనుకోటంలో నేవుంది లోకువ. వుందివుంది అని హుందాగా బ్రతుకు. వెళ్లు !" అని చెళ్లున వీపుమీద చరిచినట్లు చెప్పాడు ! ముఖ్యంగా.

రాణి : అందుకా ముత్యాలు అనటానికి ముఖ్యంగా వీళ్లే దంటున్నారూ.

ముత్యా : (చిరునవ్వాడు)

రాణి : ఎవరండీ ఆ మహానుభావుడు !

ముత్యా : పొరుగింటి పెద్దమనిషి.

రాణి : మనవీధి చివరవున్న పెద్దమేడ ఎవరో కొన్నారట ఆ యింటి...

ముత్యా : ఆయనే. సాక్షాత్తూ ఆయనే. అమ్మాయి యిక వస్తాను.

రాణి : వెళ్లిరండి ముత్యాలుగారూ !

ముత్యా : ( వెళ్లబోయేవాడు ఆగాడు. ) అదిగో ముత్యాలుగారూ

రాణి : ( వాలిక కరచుకుంది. ) కాదండి ముత్యాలరావుగారు.

గిరి : ( ఇంతట్లోకే బయటనుంచి వచ్చాడు. ) ఎవరు ? మీరా ! పేరెప్పుడు మార్చారు ?

ముత్యా : అంటే ?

గిరి : నాచిన్నప్పటినుంచీ మీరుముత్యాలే. అర్ధంతరంగా అమాంతంగా

రాణి : బావా !

గిరి : ఆగా :

రాణి : ఆయన అసలుపేరు ముత్యాలరావు. అలాగే పిలు. అందులోనూ ఆయనే స్వయంగా అలా పిలువ మంటున్నారు.

గిరి : ఓ యస్. ముత్యాలరావుగారూ ! రాణీ
( జేబులోంచి పువ్వులుతీసి రాణికిచ్చాడు )

రాణి : ( పువ్వులు తీసుకొంది. ) మరి ఇక అలాగే పిలుస్తాం.

గిరి : మీ ఆజ్ఞ పాలిస్తాం !

రాణి : ( నవ్వుకుంటూ లోనికి వెళ్ళింది. )
ముత్యా : ఆడపిల్లకు అంతనవ్వు పనికిరాదూ.
గిరి : నవ్వులు పువ్వు లౌతాయ్.
ముత్యా : నవ్వు నాలుగు విధాల నష్టం. ఒక్కమాట చెబుతా విను.
గిరి : చెప్పండి.
ముత్యా : అనగనగా ఒక దేశాన్ని ఒక రాజు పరిపాలిస్తున్నాడు
గిరి : ఆ రాజుకు ఏడుగురు కొడుకులు. ఏడుగురూ వేట కెళ్ళారు.
ముత్యా : కాదు.
గిరి : అయితే చెప్పండి.
ముత్యా : ఆ రాజుకు లేక లేక ఒక కుమార్తె జన్మించింది.
గిరి : మా మావయ్యకు మా రాణీ పుట్టినట్లు.
ముత్యా : ఆ అమ్మాయి పెరిగి పెరిగి పెద్దదయ్యింది. ఎవ్వరి మాటా వినేదే కాదు:
గిరి : మా రాణీ లాగ.
ముత్యా : ఆ అమ్మాయి అందాన్ని వర్ణించాలంటే...
గిరి : కవుల కలాలు తోణకలేదు. గాయకుల కంఠాలు, చిత్రకారుల కుంచెలు చాల్లేదు. మనకు మాటలు దొరకటంలేదు.
ముత్యా : సరిగ్గా అలాగే జరిగింది.
గిరి : ఊం. తర్వాత!

ముత్యా : రోజూ ఉదయమే రాజుగారు ఆ అమ్మాయిని తక్కెట్లో పెట్టి తూచేవారు. ఎంతబరువు తూగేదో తెలుసా!

గిరి : (తెలియదన్నాడు)

ముత్యా : ఏడు పువ్వులు. అంటే ఏడే మల్లెపువ్వులు.

గిరి : బాగుంది. చెప్పండి.

ముత్యా : విను. ఉండుండి ఒకరోజున చటుక్కున తూగటం మానేసింది.

గిరి : రాణీ: రాణీ:

ముత్యా : బాబ్బాబు యిప్పుడెందుకు!

గిరి : (రాణి గదిదగ్గరకు వెళ్లాడు.) ఓ రాణీ!

ముత్యా : మరయితే వస్తా (వెళ్ళిపోతున్నాడు)

గిరి : ఆగండి (ఆపుచేశాడు).

రాణి : (తన గదిలోంచి వచ్చింది.) ఓ ముత్యాలరావుగారూ! వున్నారా?

గిరి : చెప్పండీ.

ముత్యా : కథ అయిపోయింది. వెళ్తా.

రాణి : ఏమిటా కథ?

గిరి : ఒక రాజుగారికి లేకలేక ఒక అందమైన ఆడపిల్ల నీలాంటిది పుట్టింది. చిన్నా పెద్దా గౌరవంప మీాలేవు ఆరాజుగారి అమ్మాయికి. ఆ అమ్మాయి రోజూ ఏడు మల్లెపువ్వులఎత్తు తూగేది. ఉండుండి ఒకరోజున చటుక్కున తూగటం మానేసింది.

రాణి : మంచికథే. తర్వాత ?
ముత్యా : కథ కంచికి. మనం యింటికి. ( వెళ్ళిపోతున్నాడు. )
గిరి : ఆగండి !
రాణి : వెళ్లనీ. పాపం వారమ్మాయి ఏడు మల్లెపువ్వులు తూగుతుందో లేకపోతే ఏడుమణుగులు తూగుతుందో ?
ముత్యా : ఆఁ. ఎంతమాటన్నావ్.
రాణి : ఉన్నమాటన్నా. వెళ్లిరండి.
ముత్యా : నా కూతురు ...
రాణి : నాలాంటిదే.
గిరి : అంటే ?
రాణి : బావా !
గిరి : ఆగా :
ముత్యా : అయినా చిలిపి పిల్లలతోటి నాకేమిటి. ఆ పొరుగూరు పెద్దమనిషి ముఖ్యంగా చెప్పనే చెప్పాడు.
రాణి : ఎవరిగురించి ?
ముత్యా : నాగురించి.
రాణి : అయితే వెళ్లిరండి.
ముత్యా : వెళ్తానమ్మా ! వెళ్తాను. గిరీ మీ మామయ్యతో చెప్పు. నేను వచ్చి వెళ్లానని. చెప్పమ్మాయ్. మర్చాను. యిద్దరూకలసి చెప్పండి ముఖ్యంగా. ( బయటకు వెళ్లిపోయాడు. )

గిరి : రాణీ నీవాయన్ని అనవసరంగా బాధపెట్టావ్ !

రాణి : మరి ఆయన అన్నమాట బాగుందా ?

గిరి : కానిమాట ఏమన్నాడు ?

రాణి : ఇంకా ఏమనాలి.

గిరి : ఇదిగో రాణీ ! ఏడుమల్లెలు తూగాలట మరినీవు తూగుతావో ! లేదో ! ( దగ్గరకు తీసుకున్నాడు. )

రాణి : గొప్పవాడివేలే వదులు. ( వదిలించుకుంది )

గిరి : నిన్ను ఏడు మల్లెపువ్వులు తూగకుండా చేస్తే ?

రాణి : ఊఁ.

గిరి : ఏం చేస్తావ్ ?

రాణి : పోనీ ! మానేస్తాను.

గిరి : మరి, ప్రమాదమే !

రాణి : ఊరుకో బావా !

గిరి : నేనెందుకు వూరుకుంటాను. మామరదలు ఏడు మల్లెపువ్వులకు తూగటంలేదండోహో అని నలుగు రికి చెప్పుతాను !

రాణి : దానికి మాబావే కారణమండోహో అనిచాటిస్తాను

గిరి : రాణీ !

రాణి : బావా !

గిరి : మాఘమాస మొచ్చేస్తోంది. ( రాణిచేతులు పట్టుకున్నాడు. )

రాణి : ( సిగ్గుపడింది. ) మానాన్నతో చెప్పు.

గిరి : నీవే చెప్పు రాణీ!

రాణి : ఎక్కడయినా వుందా! నాకు పెళ్లి చెయ్యినాన్నా అని ఏ ఆడపిల్లయినా సిగ్గిడిచి, అడుగుతుందా?

గిరి : మగాడుమాత్రం నోరిడిచి అడుగుతాడా?

రాణి : అడక్కపోతే అమ్మయినా పెట్టదు!

గిరి : మూలక్కపోతే బాబైనా చెయ్యడు!

రాణి : పోనీ మీ పెళ్లిగురించి మీరడగండి!

గిరి : పోన్లే. నాపెళ్లిగురించి నీవడగక్కర్లేదు. నీపెళ్లి గురించి నీవడుగు.

రాణి : అమ్మా!

గిరి : మరెల్లా రాణీ! మనమీలా ఎంతకాలం మూగ వాళ్లగా వుంటాం? ఎంతకాలం ఇలా లొట్టలేస్తూ కూర్చుంటాం?

రాణి : అయితే మీపెళ్లిగురించి నేనడుగుతాను.

గిరి : నీపెళ్ళిగురించి నేనడుగుతాను. మరంతే రాణీ ఊc.

రాణి : సరేకాని ఎవరికి వాళ్ళకి సరేనంటే మనిద్దరికీ పెళ్ళని చెప్పేదెవరు?

గిరి : చిక్కుప్రశ్నే! ఆలోచించవలసిందే!

రాణి : అందుకే మనకొక మధ్యవర్తి వుండాలి.

గిరి : ఎవర్ని వుండమందాం! పున్నమ చంద్రుణ్ణా! కూచే కోయిలనా! పూచే పుష్పాన్నా!

రాణి : ఆc.

గిరి : ఎగిరే హంసనా!

రాణి : అహాఁ.

గిరి కాళిదాసు కలాన్నా! శ్రీనాథుని పద్యాన్నా!

రాణి : ఆహాఁ హా.

గిరి : మరి యెవరి నుండమందాం?

రాణి : వాళ్లు మన మనసుల్ని విప్పిచెప్పుతారా?

గిరి : ఓ!

రాణి : మన అనురాగానికి అర్థంచెప్పి, మానాన్న మనస్సు మెప్పిస్తారా?

గిరి : ఓ! మనపై ప్రేమవర్షంకూడా కురిపిస్తారు.
(రాణిని తనకౌగిట్లోకి తీసుకున్నాడు.)

రాణి : ఉండు బావా! మరీ చొరవచేస్తున్నావు.
(కౌగిటనుండి విడివడి బయటపడింది.)

గిరి : అబ్బ! యిదిగో రాణీ మీనాన్నను అడుగుతావా అడుగు. లేదా ఏడు మల్లెపువ్వులూ...

రాణి : పట్టుకొస్తావా?

గిరి : ఆఁ. పట్టుకొచ్చి దేవిగారిజటలో అలంకరించి ఇలా..
(అని దగ్గరకు తీసుకున్నాడు)

రాణి : బావా!

గిరి : రాణీ! మనపెళ్ళి వెంటనే జరగాలి.

రాణి : తప్పక జరగాలి!

గిరి : మరి ముహూర్తం!

రాణి : మానాన్న నడగాలి.

గిరి : నీవే అడిగి పెట్టించు యీలోపల పోష్టుమాష్టార్ని కలుసుకొస్తాను.

రాణి : ఎందుకు ? ఆయన మనకు మధ్యవర్తా ?

గిరి : కాదు. ఆయన్ని చాలా నొప్పించాం. పిల్లపెళ్ళి ఏలా చేయాలి ? ఏలా జీవించాలి ? అని ఒకటే మదనపడుతున్నాడు. సందర్భంలేకుండా మాట్లాడు తాడు. రాణీ ! ఆయనలోవున్న ఆవగింజంతబాధ యినా మీనాన్నకుంటే బయటపడుదుముకదా !

రాణి : అందుకా మీకాయనంటే సానుభూతి ! ఓదార్చి వెంటనే వచ్చేయండి !

గిరి : మీరీలోగా మీనాన్నతో చెప్పేయండి !

రాణి : అయితే మరి మీరు చప్పున వచ్చేయండి.

గిరి : యిక్కడున్నట్టు రానూ !

( రాణీ దగ్గరకుచేరి కురులు సవరించాడు. )

రాణి : ( నవ్వింది. )

గిరి : ( రాణీ నవ్వులో నవ్వుకలిపాడు. రాణీని దగ్గరకు తీసుకుంటున్నాడు. )

పురు : ( వీధిలోంచి వచ్చాడు. ) ఓరే ! గిరీ ఏంవేషంరా అది. నువ్వు ఎవరో నీకు తెలుసా ?

గిరి : మావయ్యా !

పురు : అమ్మాయ్ ఏమిటీ వేషాలు ?

రాణి : ఏమీలేదు నాన్నా !

పురు : పరువు ప్రతిష్టా లేదా! మనహోదా ఏమిటి? మనంచేసే పనులేమిటి? గిరీ ఇంట్లోకూర్చుని ఏం చేస్తున్నావ్?

గిరి : అబ్బబ్బే! మేమేంచెయ్యటంలేదు మావయ్యా!

పురు : ఏం చెయ్యటం లేదు? నీ చిన్నప్పట్నుంచీ చూస్తు న్నాను నీవరస. తల్లినిచంపి మరీపుట్టావు కదురా నువ్వు! అనాధుడవైన నిన్ను అల్లారుముద్దుగా యింట్లోకి చేరదీసి పెంచుతున్నాను.

గిరి : నేను కాదన్నానా మావయ్యా! నేనేం కానిపని చెయ్యలేదు.

రాణి : బావ ఏంచేశాడో చూడునాన్నా?

పురు : నీవేంచేశావో కాస్త చెబుదూ! తల్లి లేని నిన్ను పొత్తిళ్లలో పెట్టుకొని సాకాను. ఎనలేని సంపద సమకూర్చాను. విద్యాబుద్ధులు చెప్పించాను. యింతటివాణ్ని చేశాను. కాని నీవు...

రాణి : నాన్నా (కన్నీరు పెట్టుకుంది.)

పురు : అమ్మాయ్ ఏడ్చి నాపరువు తీయకు. గిరీ యిలా చూడు. నీవు ఎవరు? ఊఁ చెప్పు.

గిరి : నీ మేనల్లుడ్ని.

పురు : అంటే నా సొంతచెల్లెలు, నాతోపాటు రక్తాన్ని పంచుకొని పుట్టిన చెల్లెలుకొడుకువు. మహారాజశ్రీ పురుషోత్తంగారికి సాక్షాత్తూ మేనల్లుడివి అవునా?

గిరి : అవును.

పురు : అమ్మాయ్.

రాణి : నాన్నా !

పురు : నీవు నాకేమవుతావ్ ?

రాణి : అదేమిటినాన్నా !

పురు : ముందుచెప్పు. నాకేమవుతావ్ ?

రాణి : కూతుర్ని.

పురు : వట్టి కూతురువు కాదు. గారాబు పట్టివి. నేను అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యకు, నాకు కలిగిన ఏకైక సంతానానివి. ఒకవైపు మేనల్లుడు, ఒక వైపు కన్నకూతురు. నాకు యీలోకంలో కావలసినవారెవరైనా వుంటే, అది మీరిద్దరే ! ఏమిటి ? మాట్లాడరేం ?

గిరి : అవునవును.

పురు : అమ్మాయ్ !

రాణి : అవును.

పురు : యింక నేనెవర్ని ? కటికి దరిద్రుణ్ణికాదు. లక్షల కధికారిని. పలుకుబడి కలవాడ్ని. అందరూ మహారాజశ్రీ పురుషోత్తంగారూ అంటే ఎంతో గౌరవంగా చూస్తారు. అయితే మనతాహతుకు తగ్గట్టుగా మనం సంచరించాలి అవునా ?

గిరి : అవును.

పురు : అమ్మాయ్ !

రాణి : అవును.

పురు : మరి మీ యిద్దరూ ఏంచేస్తున్నారు ?

రాణి : ఏంచేశాం ?

పురు : ఇంతకన్నా ఏంచేయాలి ? నాహోదాకు తగినట్టుగా నడవాలి. నాపరువు, మర్యాద, పేరు ప్రతిష్ట నిలబెట్టాలి. చూడు వాడి మొహం.

గిరి : నేనేం చేసాను ?

పురు : నోర్మూయ్ ! పైగా ఎదిరించి మాట్లాడుతున్నావ్.

గిరి : మావయ్యా !

పురు : ఒక్కమాట అడుగుతాను చెప్పండి. ఏమిటి మీ వేషాలు ? యిద్దరూ అలా నుంచోండి. ఏమిట్రా ఆ వేషం ? పురుషోత్తంగారి మేనల్లుడు గిరి, అంటే అలాగా వుండటం ? దేభ్యంలాగ. ఆషర్టు, ఫాంటు లోపలవెయ్యి. పైన బెల్టు పెట్టు. టిప్‌టాప్‌గా వుండు ...

గిరి : ( ఆశ్చర్యపోయాడు. )

పురు : అలా చూస్తావేం ? ఆషర్టు లోపలవెయ్. వెళ్ళు యింకా నిలబడ్డావేం ?

గిరి : ఏమీ లేదు. ( తనగదిలోకి వెళ్లాడు )

పురు : అమ్మాయి. నీవు పురుషోత్తంగారి అమ్మాయివి. ఏమిటా జడ ? ఏమిటా చీర ? యికనుంచి నీవు

రెండు జడలు వేసుకోవాలి. సిఫాన్ సిల్కు తుఫాన్ చీరలు కట్టాలి.

రాణి : (నవ్వుతుంది.) నాన్నా!

పురు : నేను యిదే చెబుతున్నా. మీరు యిద్దరూ యిక నుంచి టిప్ టాప్‌గా వుండాలి. మనతాహతుకు తక్కువగా మీరు నాకళ్లకు కనుపించటానికి వల్ల కాదు. తెలిసిందా? అమ్మాయి వెళ్లు. రెండు జడలు వేసుకురా.

రాణి : అలాగే నాన్నా! (తనగదిలోకి వెళ్లింది)

పురు : అమ్మయ్య! (సోఫాలో కూర్చుని కూజాలోని నీళ్లుత్రాగి పేపరు చూస్తున్నాడు.)

గిరి : (లోపలనుంచి టక్ చేసుకొని వచ్చాడు.)

పురు : ఒరే గిరీ ఆలాగ వుండాలి. పురుషోత్తంగారి మేనల్లుడుగా యిప్పుడున్నావు తెలుసా?

గిరి : మావయ్యా నీకు కోపం రాకుండా వుంటే...

పురు : చెప్పరా చెప్పు.

గిరి : యీ వేళనీవు అర్జంటుగామారిపోయావు మావయ్యా పూర్తిగా మారిపోయావు.

పురు : అవును. యిది అపూర్వమైన మార్పు. అద్భుతమైనమార్పు. డ్రెస్‌లోమార్పు. మాటలోమార్పు భావాల్లో మార్పు.

గిరి : మనిషేమార్పు. ఏమిటి మామయ్యా అంతవిప్లవం?

పురు : అదే అర్థంచేసుకో.

గిరి : అబ్బే నావల్లకాదు.

పురు : (గర్వంగా నవ్వాడు.) వినుచెప్తా. నేను... తర్వాత చెప్తాగాని నీవు రెడీమేడ్ షాపుకెళ్ళి... సైకిల్ వేసుకెళ్లు. ఒకసూటు ఫుల్‌సూటు పట్టుకురావాలి.

గిరి : ఎవరికి ?

పురు : అంతావిని రాముడికి సీత ఏమవుతుందంటావేమిటి? నాకేరా. స్వయంగా నాకే.

గిరి : నీకా !

పురు : ఆశ్చర్యంగా వుందా ?

గిరి : అబ్బే ! యీ వయసులో...

పురు : నేను ముసలివాడి నంటావా ?

గిరి : నేనెందు కంటాను !

పురు : కాలాన్నిబట్టి మారాలి. పొరుగువాడిని చూసి నేర్చుకోవాలి. మనవూరికి కొత్తగా ఒకపెద్దమనిషి వచ్చాడు. ఆ పొరుగూరి పెద్దమనిషి ఎంతహుందా సమితీవి ? ఏమిదర్జా ! ఏమి మర్యాద ! అతని మాటే మంత్ర ముగ్ధుల్ని చేస్తుంది. అది బ్రతుకంటే. అహా ! హా హా.

గిరి : అర్థమైంది మావయ్యా !

పురు : అయ్యిందా !

గిరి : అయ్యింది.

పురు : ఏమయ్యింది. చెప్పు చూద్దాం.

గిరి : ఆ పొరుగూరు పెద్దమనిషి ఫుల్ సూటులో టిప్ టాప్‌గా వున్నాడు. ఆదర్జా, ఆదర్జాలో హుందా, ఆ హుందాలో గౌరవం, ఆ గౌరవంలో కీర్తి, ఆ కీర్తిలో తృప్తి, తృప్తిలో ముక్తి.

పురు : చెప్పు. గాడిలో పడ్డావ్ చెప్పు.

గిరి : అందుకే రాణీని, నన్ను టిప్ టాప్ గా వుండమన్నావు. నీవుకూడా ఆ పొరుగూరి పెద్దమనిషిలాగా ధగ ధగా...

పురు : అమోఘంరా నీబుర్ర (ఠీవిగా చావడిఅంతా తిరుగుతాడు) అందుకే ఒక మంచి సూట్ తీసుకురా.

గిరి : మావయ్యా యిప్పుడు నువ్వు కలతిరుగుతున్నావే ఠీవిగా. అలాగే ఆపొరుగూరు పెద్దమనిషికూడా...

పురు : అవును (నవ్వాడు) ఏరా నేనిప్పుడు ఠీవిగా కనబడుతున్నానా !

గిరి : నిన్నుచూస్తే డంగై పోవలసిందే. ఎవడైనాసరే. సూటు పట్టానా ?

పురు : ఆఁ. ఆఁ. త్వరగా వెళ్లు.

గిరి : ఒక్క క్షణం మావయ్యా! (వీధిలోకి వెళ్లి పోతున్నాడు)

పురు : ఒరే.

గిరి : ( వెళ్లేవాడు ఆగాడు )

( లోపలనుండి వచ్చింది రాణి )

పురు : మెజర్ మెంట్సు. కొలతలు అక్కర్లేదేమో !

గిరి : అవును. రాణీ చేపుందా ?

రాణి : లేదే !

పురు : యిప్పుడెలాగా !

గిరి : నీవు అధైర్యపడకు మావయ్యా.
(తనగదిలోకి జోరుగా వెళ్లాడు.)

పురు : అమ్మాయి నీకు ఆ రెండుజడలు చాలా అందంగా వున్నాయ్. పురుషోత్తంగారి కూతురంటే యిలా వుండాలి.

రాణి : ఏమిటి నాన్నా యిదంతా ?

పురు : ఏమిటా ! నీవేనా నన్నిలా అడుగుతుంటా ?

గిరి : (తనగదిలోంచి జోరుగానే వచ్చాడు.) మావయ్యా యిదిగో పురుకొస్తా, అడుగుబద్దా.

రాణి : ఎందుకు ?

గిరి : తెల్లకాగితంమీద కొలతలువెయ్. పెన్ను యిదిగో కాలు నలభై, నడుం ముప్పై, మవయ్యా కాలు లూజు.

రాణి : లూజే! ఏయ్ టైలర్ సరిగ్గా కొలు.

గిరి : ఏయ్ అంకెలు సరిగా వెయ్. చొక్కా ఛాతి 38. ఆలాచూస్తావేం ? వ్రాయి. చెయ్యి ముప్పైనాల్గు వ్రాసావా ?

రాణి : ఆఁ.

గిరి : కాగితం ఏది (రాణిచేతిలోంచి తీసుకున్నాడు.) ఏం మావయ్యా వెళ్లిరానా?

పురు : యిక్కడ వున్నట్లు రావాలి.

గిరి : హనుమంతుడు సంజీవికోసం వెళ్లినట్లు, వెళ్లి చక్కా వస్తాను. (వీధిలోకి వెళ్లి పోయాడు)

రాణి : నాకేమీ అర్థం కావటంలేదు నాన్నా!

పురు : రాణీ యీలా చూడు, కాలంతోపాటు మనం నడవాలి.

రాణి : నడవక కూర్చున్నామా?

పురు : ఆ విస్సందేహంగా. మనవూరికి ఒక పొరుగూరు నుంచి ఒక పెద్దమనిషి వచ్చాడు.

రాణి : వస్తే!

పురు : వస్తే! ఎంత తేలిగ్గా మాట్లాడావ్! ఆ పెద్దమని షిని చూడాలని నేను వారింటికి వెళ్లాను.

రాణి : మనవీధి చివర...

పురు : ఆ పాతభవంతి కొన్నాడు. అధునాతనంగా మార్చి పారేశాడు. నేను లోపలికి అడుగుపెట్టాను. అతను ఆ పెద్దమనిషి ఆమేడమెట్లు మీదనుంచి ఠీవిగా దిగివచ్చాడు. ఫుల్ సూట్‌లో వున్నాడు. నోట్లో పైప్ వుంది. అచ్చు దొరలా వున్నాడు. నావంక చిరునవ్వుతో చూశాడు నమస్కారంఅన్నా. ఎంతో ఆదరంతో దయచేయండి. దయచేయండి

ఉత్తమ్ జీ అన్నాడు. ఎవర్నా అని చుట్టుపక్కల చూశాను. ఆయన నేను తప్ప అక్కడ అప్పుడు యింకెవ్వరూ లేరు. మిమ్మల్నే నండి పురుషోత్తం గారూ అన్నాడు.

రాణి : నాన్నా!

పురు : ఏమిటి రాణి!

రాణి : మన పోష్టు మాష్టరుగారి పేరు యీవేళనుంచి ముత్యాలుకాదు. ముత్యాలరావు.

పురు : అదేం ఏం పొయ్యేకాలం వచ్చింది వాడికి!

రాణి : మీరు ఉత్తమ్ అయినప్పుడు ఆయన ముత్యాల రావు కాకూడదా?

పురు : అయితే అతనుకూడా ఆపెద్దమనిషిని కలుసుకున్నా డన్నమాట.

రాణి : నీకోసంకూడా వచ్చాడు.

పురు : ఎందుకు?

రాణి : ఏమో.

పురు : అతనిగోడవరోజూవుండేదే. ఏంమర్యాదచేశాడను కున్నావ్ ఆ నౌఖర్లు, చాకర్లు, ఆ హంగు, ఆ ఆర్భాటం, అబ్బ! చూడాలి రాణీ చెప్పటం నావల్లకాదు.

రాణి : ఇంతకీ ఆయన దేవ్వూరు? ఎందుకొచ్చాడిక్కడికి?

పురు : ఏమో! ఆయన్ని చూస్తుంటే అవన్నీ అడగబుద్ధి కాలేదమ్మాయ్!

రాణి : పోనీ పేరైనా తెలుసుకున్నారా?

పురు : లేదమ్మా. అతన్ని చూస్తుంటే మంత్రముగ్ధుల మైపోతామనుకో.

రాణి : అంత గొప్పవాడా?

పురు : చూస్తే నీకే తెలుస్తుంది.

రాణి : పోనీ మనింటికి ఒకసారిరమ్మనలేకపోయావానాన్నా!

పురు : అతన్ని చూస్తుంటే మనం ఏమీ అనలేమమ్మా ధైర్యంచేసి రమ్మనాలనిపించింది. కాని నోట్లోంచి మాట పెగిలి రాందే!

రాణి : మాట్లాడితే చంపేస్తాడా?

పురు : అతని ఎదురుగా మాట్లాడలేం.

రాణి : ఏం నరసింహావతారమా?

పురు : అబ్బ! నీకర్థమయేలాగ చెప్పలేక పోతున్నాను. ఆ అపూర్వ వ్యక్తి...

రాణి : ధగధగా వెలిగిపోతుంటాడా?

గిరి : (వీధిలోంచి జోరుగా వచ్చాడు.) మావయ్యా ధగ ధగా వెలిగిపోతోంది చూడు. (చేతిలోవున్న ఫుల్ సూటు చూపించాడు.)

రాణి : మానాన్నకే!

గిరి : కాదు నీకు.

రాణి : (చిరుకోపగించుకుంది.) చూడునాన్నా!

పురు : (సూటును చూశాడు.) బాగుందిరా.

గిరి : మరివేసుకో మావయ్యా చెప్తాన.

పురు : (తనగదిలోకి నూటుతోసహా ఉత్సాహంగా వెళ్ళాడు.)
గిరి : అమ్మయ్య! యిప్పటికి బరువు తీరిందిరా బాబా
(సోఫాలో కూలబడ్డాడు.)
రాణి : (తాను సోఫాలో కూర్చుంటూ) నిజంగా నాన్న మనల్ని చూశాడని గాబరా పడ్డాను.
గిరి : (గాభరాగా లేస్తూ,) చూడు చూడు. గుమ్మంలోంచి (రాణీని లేవదీశాడు.) మళ్ళీ వస్తున్నాడేమో...
రాణి : (లేచింది గుమ్మంవరకూ వెళ్ళి లోపలకు చూసి, గిరికి రహస్యంగా చెప్పింది.) లేదు!
గిరి : లేదుకదా. బ్రతికాం. (సోఫాలో కూర్చున్నాడు.)
రాణి : ఏమిటిబావా యిదంతా (సోఫా చెయ్యిమీద కూర్చుంది)
గిరి : మీనాన్న ఎక్కడైనా బుల్లిఅత్తను చూశాడేమో
రాణి : ఏం మాటలవి? (కోపంవచ్చి లేచింది.)
గిరి : ఏం పెళ్ళి చేసుకుంటాడు.
రాణి : మానాన్నతో చెబుతానుండండి బావగారూ! నా...నా.
గిరి : (కంగారుగా లేచివెళ్ళి రాణీ నోరుమూశాడు.) చంపేశావ్ మన పెళ్ళవుతుంది.
రాణి : జాగ్రత్త ఏమనుకున్నారో.
గిరి : అదికాదు రాణి. మీనాన్న బొత్తిగా కుర్రాడై పోతున్నాడు కదూ!
రాణి : అదంతా పొరుగూరు పెద్దమనిషి ప్రభావం.
గిరి : నెమ్మదిగా అంటావేమిటి. చంపేస్తున్నాడు. నన్ను

టక్ చేసుకోమంటాడు. నిన్ను టాయ్‌లెట్ అవ్వమంటాడు. రెండుజడలు వేయమంటాడు. తాను రెండు పిలకలంటాడు. ఒక సూటంటాడు.

రాణి : ఎవరికోసం ? ఏం చెయ్యమంటే అది చెయ్యాలి. పిల్లనిచ్చే మామగారు !

గిరి : చిత్రం. మరి పెళ్ళి చేసుకునే పిల్లమాటకూడావినాలా?

రాణి : అలారా దార్లోకి.

గిరి : ఏమిటీ ఆర్డర్ ?

రాణి : చేతులు కట్టు.

గిరి : ( కట్టాడు. )

రాణి : విప్పు.

గిరి : ( విప్పాడు. )

రాణి : కూర్చో.

గిరి : ( కూర్చున్నాడు. )

రాణి : నుంచో.

గిరి : ( నుంచున్నాడు. ) మరి పెళ్ళిచేసుకొనే పెళ్ళికొడుకు మాటకూడా వినాలి.

రాణి : జీ హాఁ.

గిరి : చేతులు కట్టు.

రాణి : కట్టాం. ( కట్టింది )

గిరి : కళ్లు మూసుకోవాలి.

రాణి : మూశాం. ( కళ్లు పూరాగా ముయ్యకుండా దొంగచూపు చూస్తుంది )

గిరి : ఏయ్! దొంగ చూపులు చూడకూడదు. సరిగా ముయ్ కళ్లు. ( కౌగిట్లోకి తీసుకొంటూముద్దు పెట్టుకో బోయాడు )

రాణి : ( చూసి, విదిలించుకొని బయట పడింది ) ఎంత ఆశ. ( తన గదిలోకి పారిపోబోయింది )

గిరి : ( జడపట్టుకొని ఆపు జేశాడు ) యిప్పుడెక్కడికి వెళ్తావ్?

రాణి : ఏయ్ గిరీ! ఏంపని యిది ( జడ విదిలించుకుంది ) నీవెవ్వరవో నీకు తెలుసా? మాట్లాడవేం? ఏమిటీ వేషాలు? పరువు ప్రతిష్టవుండక్కర్లేదా? మంచి, మర్యాదలేదా? చిన్నప్పట్నుంచీ నిన్ను చూస్తున్నాను. బొత్తిగా ఆగడ మెక్కువై పోతుంది.

గిరి : అబ్బే నేనేం చేశాను?

రాణి : నువ్వెవరవు?

గిరి : గిరిని.

రాణి : నువ్వొక గిరివే కాదు.

గిరి : రాణి ప్రియుణ్ణి.

రాణి : నేనెవర్ని?

గిరి : రాణివి.

రాణి : నేనొక్క రాణీనే కాదు. గిరిగారి వాణిని. ఈ యింటి మణిని.

గిరి : అందాల భరిణివి.

రాణి : యీ రాణీగారి పేరు చెబితే చంద్రుడు చిన్న బుచ్చుకుంటాడు. కవులు కలాలు పడతారు. నర్త

కిల గజ్జలు ఘల్లున మ్రోగుతాయి. గాయకుల కంఠాలు మెదులుతవి. కోయిలలు పాడుతాయి. అందుచే తాహతుకు తగ్గట్టుగా నడచుకోవాలి.

గిరి : అవును.

రాణి : మరి నీ వేంచేస్తున్నావ్ ?

గిరి : నేనేం చేయ్యలేదే !

రాణి : ఏమిటా వేషం ? ఏమిటా చేష్టలు ? వెళ్లు. టాయ్‌లెట్ అయ్యిరా.

గిరి : ( తనగదివైపు వెళ్లబోయాడు )

రాణి : గిరి !

గిరి : ( ఆగాడు ) జీ !

రాణి : మాట పూర్తికాకుండా వెడతావేం ? బజారుకు వెళ్లి మనకొక సిఫాన్‌సిల్కు తుఫాన్ చీర, జార్జెట్ జాకెట్, హాలీవుడ్ బాడీ, ఫేస్ పౌడరు టిన్, కూంబ్, మిర్రర్, నైల్ పాలిష్, లిప్‌స్టిక్, హేండ్ బేగ్ అర్జంటుగా తీసుకురా.

గిరి : ( వీధిలోకి వెళ్లటం లేదు ) సరే. వెళ్లోస్తా.

రాణి : యింకా నిలబడ్డావేం ? జ్ఞాపకంవున్నాయా అన్నీ ? ఒక్క వస్తువు మర్చిపోకూడదు. మన దర్జాకు తగ్గట్టుగా వుండాలి. గిరిగారి భార్యంటే ఎలా వుండాలి ?

గిరి : చిత్తం.

రాణి : ఏమిటూ విధేయత ? ఒకటి లోటుచేసి నా కంటికి కనుపిస్తే నేనూరుకునేదిలేదు. తెలుసా ? వెళ్లు.

గిరి : వెళ్తున్నా ! ( రాణిని కౌగిట్లోకి తీసుకుంటున్నాడు )

రాణి : బావా ! ( రాణి కౌగిట్లోకి చేరింది )

గిరి : రాణీ !

( యిద్దరూ విరగబడి నవ్వుకుంటున్నారు )

చిదా : ( బయటనుంచి పిలిచాడు ) ఉత్తమ్‌జీ ! ఉత్తమ్‌జీ !

( పిలుపు విని నవ్వులు ఆగిపోయాయి )

గిరి : రాణీ వచ్చేశాడు. వచ్చేశాడు.

రాణి : ఎవరు ?

గిరి : పొరుగూరు పెద్దమనిషి.

చిదా : ( బయటనుంచే మరల పిలిచాడు ) ఉత్తమ్‌జీ !

గిరి : అచ్ఛా ! ఆటో జీ !

రాణి : బావా !

గిరి : ఆగా !

చిదా : ( బయటనుంచి లోపలకు వచ్చాడు ) Good morning! Very glad to meet you.

గిరి : Yes, Yes.

రాణి : మేము ఎవరో తమకు తెలుసా ?

గిరి : ఆc. తెలిసే మాట్లాడాలో ?

చిదా : ఫస్ని ( నవ్వాడు ) మీతోరు...

గిరి : ఎవరంటూరా ?

రాణి : ఆయన అనందే.

గిరి : యింతకీ మీరు ...

రాణి : ఓ పొరుగూరునుంచి మనవూరికి వచ్చిన ఓ పెద్ద మనిషి.

చిదా : మీకెలా తెలుసు ?

రాణి : మా నాన్నగారిని యీ భూప్రపంచంలో ఎవ్వరూ ఉత్తమ్‌జీ అనరు.

గిరి : మీరు మాత్రం ...

చిదా : అంటున్నాననా ? అనాలి. నాకు స్త్రీ పురుష లింగ భేదములేదు. అంతా సమానమే. ఉత్తమ అనే మాటముందు పురుష అని రాకూడదు. ఉత్తమ్ అన్నప్పుడు ఎవరైనా కావచ్చును. స్త్రీ పురుష పక్షపాతం లేకుండా నేను ఉత్తమ్ అనే ఉత్తమమైనమాటనే వాడుతాను. అందుకే ఉత్తమ్ జీ అంటున్నాను.

గిరి : ఇంతకీ మీరు ...?

చిదా : మీ వీధి చివరనున్న పెద్దమేడ.

గిరి : అని మాకు తెలుసు.

చిదా : చాలా సంతోషం. ఉత్తమ్‌జీ లేరా ?

రాణి : ఉన్నారు. పిలవమంటారా !

చిదా : పనిలోవుంటేవద్దు. ఒకసారి కర్టిసీవిజట్ కొచ్చాను. అంతే వారు మా యింటికొచ్చారు. నేను మీ యింటికి రావడం ధర్మం.

రాణి : కూర్చోండి.

చిదా : Thanks ( విజిటింగ్ కార్డు తీసి గిరి చేతికిచ్చాడు ) యివ్వండి.

గిరి : ( కార్డుఅందుకుని చదివాడు ) చిదానంద్. మావయ్యా! మావయ్యా ! ( తొందరగానే పురుషోత్తంగారి గదిలోకి వెళ్లాడు ) మావయ్య పొరిగింటి పెద్దమనిషి చిదానందంగారు వచ్చారు.

( గిరి పురుషోత్తం గదిలో అన్నమాటలు చావిడిలోకి వినిపించాయి )

పురు : ( లోపలనుంచి వస్తున్నాడు ) ఎంత అదృష్టం : ఎంత అదృష్టం ( యిప్పటికి చావిడిలోకి పూరాగా వచ్చాడు ) మీరు మా గృహానికి రావడం మా అదృష్టం. ( ఫుల్ సూటులో వున్నాడు )

చిదా : చాలా Thanks ( సోఫాలోంచి లేచాడు )

పురు : కూర్చోండి. కూర్చోండి.

చిదా : ఏమి కర్టిసీ ఏమి కర్టిసీ. ఫరవాలేదు. ముందుగా ఇంటిమేట్ చెయ్యకుండా వచ్చాను! మీ కార్యక్రమాలకి యిబ్బంది కాదుగదా ?

పురు : ఎంతమాటన్నారు. మీలాంటి అపూర్వ వ్యక్తి మా ఇంటికి రావటం మా పూర్వజన్మ సుకృతం. అమ్మాయి రాణీ నిలబడ్డావేం ? వీరికి కాఫీచూడు. మా అమ్మాయండి.

రాణి : ( మౌనంగా తండ్రికి అంగీకారం తెలిపింది. లోనికి వెళ్లింది )

చిదా : ఏ [illegible]ంపీ శాంపిల్. వెరీ క్లవర్ గరల్. Just [illegible]ప్పుడే కాఫీ తీసుకున్నానండి.

గిరి : ఆఫ్టరాల్ కాఫీ దేముందండి. మా యింట్లో ఎప్పుడూ మరుగుతూనే వుంటుంది. ప్రత్యేకం పెట్ట నవసరం లేదు.

చిదా : వెరీ ర్యాప్ట్.

పురు : ఒరేయ్ నువ్వు దొడ్లో చెట్టెక్కి బత్తాయిలు నాలుగు కోసుకురా.

గిరి : నేనా.

చిదా : అబ్బాయిని శ్రమపెట్టకండి.

పురు : ఫరవాలేదు, వెళ్లనివ్వండి. మద్రాసు వరకూ మా బత్తాయిలు ప్రసిద్ధండి. పాలకొల్లు బత్తాయిలు వీటిముందు దిగదుడుపు. అవి మీ వంటి స్నేహితులకు మాత్రమే. వెళ్లరా గిరీ !

గిరి : ఆలాగే మావయ్యా (యిష్టం లేకుండానే తప్పని సరిగా వెళ్లాడు)

పురు : నిలబడే వున్నారు.

చిదా : ఫరవాలేదు. మీ ఇల్లు చాలాబాగుంది ఉత్తమ్‌జీ.

పురు : అభిమానం కొద్దీ అలా అంటున్నారు. ఇది old Construction.

చిదా : ఆర్టిస్టిక్ నాకు పొగడ్త అంటే బొత్తిగా కిట్టదు. ఉన్నది ఉన్నట్టుగా మాట్లాడేయటం నాకు చాలా యిష్టం. ఒకప్పుడు నేను అజంతా వెళ్లాను ప్రాచీన శిల్పాలు చూడాలని.

పురు : చాలా ప్రదేశాలు తిరిగుంటారు.

చిదా : తిరిగానండీ తిరిగాను. బాధ్యతఅలాంటిది. బిజినెస్ అన్నాక తిరుగుడు లేకుండా వుంటుందా ? ఏదో మాట్లాడుతూ వ్యాపారం గొడవలోకి వచ్చాను. ఆ శిల్పాలు అజంతా వెళ్లినప్పుడు నాకు ఓ పురా తన వస్తు పరిశోధన శాస్త్రవేత్తకు పోటీ పడింది.

పురు : దేన్ని గురించండీ ?

చిదా : అదే చెప్తున్నా. అజంతా గొప్పా ? ఎల్లోరా గొప్పా అని. అప్పుడు నేను.

పురు : మీరే నెగ్గుంటారు.

చిదా : పూర్తిగా వినండి.

పురు : వినాలటండీ ఒక్క మెతుకు పట్టుకుని చూస్తే చాలదూ.

చిదా : అవుననుకోండి. కానీ...

పురు : మీరు మీ గొప్ప చెప్పుకోటానికి బిడియపడు తున్నారు. గొప్పవాళ్ల లక్షణమే అదండీ. మీరు ఎన్ని దేశాలు తిరిగినా నాకు ఆ నమ్రతేను తెలుసండీ.

చిదా : ఉత్తమ్‌జీ !

పురు : (తన ధోరణిలోనే వున్నాడు) చిదానందంగారు ఈపల్లె టూళ్లో యింత పెద్ద భవంతికొని పెద్ద ఫ్యాక్టరీ కడుతున్న ఆసామీ ఎవరు చెప్పండి ? ఏమండీ మిషనరీ ఏ దేశంనుండి వస్తుందండీ ?

చిదా : యు. కె. ఆర్; యు. యస్. ఎ; కాకపోతే యు. యస్. యస్. ఆర్.

పురు : కాకపోవటమేమిటండీ.... ఆ తమరు యు. యస్. ఎ. ఎప్పుడైనా వెళ్లారా? వెళ్లేవుంటారు.

చిదా : యు. యస్. ఎ. గొప్పనుకుంటున్నారా? మన దేశాన్ని మించింది కాదనుకోండి. అయినా మన కంటెవాళ్లు శాస్త్రంలో Advance అయ్యారండీ.

గిరి : (లోపలినుంచి హడావిడిగా వచ్చాడు.) మావయ్యా! మావయ్యా!

పురు : ఏం మునిగిందిరా?

గిరి : చీమలు. చీమలు: పుట్టలు: గుట్టలు: గుట్టలు.

పురు : చవటా! చీమలా! అందుకని చెప్పకుండా వచ్చావా?

గిరి : ఎక్కాను. చీమలు కుట్టాయి.

పురు : మా కాయలు తీపండి. అందుకే అన్ని చీమలు.

చిదా : వండర్స్ ఆఫ్ ది వరల్డు.

పురు : ఇంత పెద్దమనిషికి మనకాయలు రుచిచూపిద్దా మనుకుంటే నువ్వు చెప్పకుండా....

గిరి : కాదు — కుట్టినా నేను ఎడ్వాన్సు అయ్యాను మావయ్యా.

పురు : అంటే?

గిరి : అంటే....

చిదా : అంటే చీమలు కుట్టుతున్నా ముందుకు పురోగమించారన్నమాట.

గిరి : అవును. అలాచేశాను. కాని మళ్లీ కుట్టాయి.

చిదా : అందుచేత దిగివచ్చారు.

గిరి : అచ్చం అంతే జరిగింది.

పురు : పిరికి వెధవ !

చిదా : అంతమాటనకండి.... రెండవ ప్రపంచ యుద్ధంలో మిత్రరాజ్యాల సైన్యాలే హిట్లరు ధాటికి తట్టుకో లేక తిరోగమించాయి. ఆలాగే వీరు...

పురు : నామేనల్లుడు. అంటే నాస్వంతచెల్లెలుకొడుకు గిరి.

గిరి : E. S. L. C.

చిదా : Very glad to meet you.

గిరి : Yes. Yes.

చిదా : శ్రీ గిరి E. S. L. C. బత్తాయి చెట్టువద్దకు ముట్టడికి వెళ్లారు. ఫాసిస్టుసైన్యాలవలె చీమల దండు ప్రతిఘటించింది.

గిరి : Yes! Yes!

చిదా : మిత్రరాజ్యాలు తిరోగమించినట్లు తెలివిగా....

గిరి : సాహసంగా తిరిగి చక్కావచ్చాను. కాయల్తో !

పురు : ఆ రి పి డు గా.

చిదా : Bravo ( బ్రేవో )

పురు : ఎట్లా కోశావురా !

గిరి : కొంకికర్ర ప్రయోగించాను మావయ్యా.

పురు : ఇంతకీ కాయలేవి ?

గిరి : రాణికి ఇచ్చి ఒల్చి తెమ్మన్నాను.

చిదా : నాటకరచయిత తనరచనలో ముఖ్యంగా సస్పెన్సు ఉండేలాచూస్తాడు. ఆలాగే శ్రీగిరి E. S L. C. గారు కూడా మెయిన్‌టైన్ చేశారు.

పురు : చిదానందంగారు మీకు కవిత్వంకూడా వచ్చు అనుకుంటాను.

గిరి : అనుకోవటం ఏమిటి మావయ్యా. పూర్వజన్మలో ఆయన కవి అయ్యేవుంటారు.

పురు : ఏమండీ ?

చిదా : అడిగారుకాబట్టి చెబుతున్నాను. నేను ఒకకావ్యం వ్రాశా

పురు : నా అంచనా రైటన్నమాట. ఏరా గిరి.

గిరి : నీబుర్ర అమోఘంకదూ మావయ్యా. చిదానందం గారు మావయ్యా....

పురు : ఆయన ఏదో చెప్తుంటె....

గిరి : చెప్పండి చిదానందంగారు

చిదా : పెద్ద ఏమీ లేదనుకోండి.

పురు : గొప్పవారు ఆలాగే అంటారు.

గిరి : అక్షరాల.

చిదా : నన్ను బొత్తిగా పొగిడేస్తున్నారు.

గిరి : మావయ్య ఉన్నది ఉన్నట్లు అనుకొన్నది అను కొన్నట్లు అంటాడండి.

పురు : ఉండరా! ఆఁ చెప్పండి. కావ్యం వ్రాశానన్నారు.

గిరి : దేన్ని గురించో!

పురు : ఓరే!

గిరి : చెప్పండి.

చిదా : చెప్తున్నాను. కావ్యం వ్రాశాను. దేన్ని గురించి అనుకున్నారు. అజంతా ఎల్లోరాలను గురించి. ఏదిగొప్ప అని. అప్పుడేం జరిగిందంటే ఆ పెద్ద మనిషి నేను అజంతాగొప్ప ఎల్లోరాగొప్ప అని చచ్చేటట్లు వాదించుకొన్నాం. మామధ్య తగువు చివరకు....

పురు : ఆ. ఆ. ఏంచేశారు?

గిరి : కావ్యం.

పురు : గిరీ!

చిదా అదే చెప్తున్నా కావ్యం వ్రాసా. ఆ కావ్యానికి ఆధారం మాతండ్రిగారు స్వహస్తాలతో ఆంగ్లంలో అజంతా, ఎల్లోరాగురించి వ్రాసిన పద్యకావ్యం.

పురు : మీ తండ్రిగారుకూడా కవి అన్నమాట.

చిదా : వినండి. ఇంకావుంది చెబుతా. మా తాతగారు సంస్కృతంలో ఓ కావ్యం వ్రాసారు. ఆ కావ్యం మా తండ్రిగారి ఆంగ్ల కావ్యానికి మాతృక.

పురు : మీ తాతలనాటినుంచీ....

చిదా : అప్పుడే ఏమయ్యిందీ. మా ముత్తాతగారు పుస్త

భాషలో ఓ కావ్యం వ్రాసారు. అది మా తాత గారి సంస్కృత కావ్యానికి మాతృక.

పురు : అయితే మీది కవులవంశం.

గిరి : మావయ్యా పండిత వంశం.

పురు : నిమ్మదిగా అంటావేమిటరా ?

గిరి : గట్టిగానే అంటాను. ఏమండి చిదానందంగారు. ఆ కావ్యాలు చదవాలని చాలా కుతూహలంగా వుందండి.

చిదా : ఆ యోగ్యత నాకు లేదండి గిరిగారు.

పురు : ఏమండీ ?

చిదా : అవన్నీ యిప్పుడు లేవండి.

పురు : ఎవరైనా కాజేశారేమో. దుర్మార్గులు.

చిదా : నా దురదృష్టం. ఏలా జరిగిందంటే....

రాణి : ( కాఫీ ఫలహారాలు ట్రేలో పెట్టుకు వచ్చింది. )

గిరి : ( అవి అందుకొని చిదానందంకు యిచ్చాడు ) పాపం ! తీసుకోండి.

చిదా : ఆ విషయం తలుచుకుంటే నాకు దుఃఖంవస్తోంది. కాని పెద్దమనుష్యులు మీరు అడిగారు కాబట్టి అసలువిషయం చెబుతున్నాను.

రాణి : ( ఇంతలో తండ్రికి బావకు కాఫీ అందుబాటులోకిచేర్చింది )

చిదా : అజంతా ఎల్లోరామీద మా ముత్తాతగారు పుస్తు భాషలో వ్రాసిన కావ్యాన్ని సంస్కృతంలో వ్రాసి ఆ కావ్యం తగులబెట్టేశారు.

గిరి : హరి హరి (అని నెమ్మదిగా అనుకున్నాడు.)

చిదా : ఈ విషయం మా తాతగారు తాను వ్రాసిన కావ్యానికి వ్రాసిన పీఠికలో వ్రాశారు. అలాగే నా ఆచార ప్రకారం మా నాన్నగారు ఇంగ్లీషులో ఆ కావ్యాన్ని వ్రాసి పీఠికలో సైతం ఉదంతాన్ని పొందుపరచి సంస్కృత కావ్యాన్ని అగ్నికి ఆహుతి యిచ్చారు.

గిరి : నారాయణ నారాయణ. (నెమ్మదిగానే అనుకున్నాడు)

చిదా : ఆలాగే నేనుకూడా తెలుగులోకి అనువదించి పీఠికపై సంగతంతా పొందుపరచి దుఃఖపూరిత అశ్రునయనాలతో ఆ ఆంగ్ల కావ్యాన్ని అగ్నిదేవునికి అర్పించాను.

రాణి : ఇంతకీ మీరు వ్రాసిన తెలుగు కావ్యం....

చిదా : ఉంటే కన్నీరు ఎందుకు కార్చాలి?

రాణి : ఏం జరిగింది?

చిదా : అదో పెద్ద కథ. ఆ కావ్యాం వ్రాసిన వెంటనే నాకు పెద్ద జబ్బుచేసింది. డాక్టర్ బి. సి. రాయ్ ప్లెయిన్ మీదవచ్చి స్వయంగా ట్రీట్ చేసి వెళ్లాడు. కాని నయంకాలేదు. మా అమ్మగారు మా చిదానందం ఈ కావ్యం వ్రాసాక జబ్బుపడ్డాడు. ఇక నీవంటికి పడదని, నాభావ ఝుంఝామారుతాన్ని నా తెలుగు కావ్యాన్ని, నా కావ్య కన్యకను

పొయ్యిలో పారేసింది. అంతే అంత మొండి రోగం ఏమైందో తక్కున లేచికూర్చున్నాను. ఇలా జరిగింది. ఆనాటినుంచి నేటివరకు ఒకపంక్తి కూడా వ్రాయలేదు.

గిరి : విచారించకండి.

పురు : అయినా లక్ష్మికి, సరస్వతికి పడదన్నారు. లక్ష్మి వున్న యింట్లోంచి సరస్వతి లేచిపోయింది. అది మీపట్ల నిజమయ్యింది.

రాణి : కాఫీ చల్లారిపోయింది.

చిదా : అంతటితో నాకవిత్వం అడుగంటి పోయింది. మళ్ళీ నన్ను కలంపట్టమని రాజమన్నారు ఏదీ ఛీఫ్ జస్టిస్ తక్కెడు ఉత్తరాలురాశాడు. కోకా సుబ్బారావు లేడూ....

పురు : ఆఁ హైకోర్టు జడ్జి.

చిదా : తెగ పట్టుపట్టాడు. ఇక నావంటికి కవిత్వంపడదూ. మొగమాట పెట్టకండన్నాను.

పురు : ఎంతమాట.

చిదా : మొన్నమట్టుకు మొన్న స్థానం.

పురు : ఏదీ పద్మశ్రీ స్థానం.

చిదా : ఒక్క నాటకం వ్రాసిపెట్టమన్నాడు. తనకు కన్య వేషంవేయాలని కుతూహలంగావుందట. యీాలా పీక్కుతింటున్నారు. మనవంటికిపడదూ. కాదంటే కష్టాలు తోస్తాయ్ !

పురు : అదే కదండీ చిక్కు.

చిదా : (ఒక గుక్కలో కాఫీ తాగేశాడు) మరి శలవా? అవతల చాలా పనులున్నాయ్. బ్యాంకోసారి వెళ్ళాలి.

పురు : అలాగే వెడుదురుగాని మాఇల్లు ఒక్కసారి చూసి.

చిదా : మీఇల్లుకేమండి. బంగారం. ఆ బంగారం [illegible] పెరిగిందండీ ఉత్తమోజీ!

పురు : ఆలాగాండీ.

చిదా : సర్వోదయా బ్యాంకువాళ్లు లేరండి. వాళ్ళకు మొన్న రెండు లక్షలు కావాలని కబురుపెట్టాను. ఈవేళ వచ్చి తీసుకుపొమ్మన్నారు. మాచర్ల సిమ్మెంట్ ఫ్యాక్టరీలో షేర్సు తీసుకోమని రామకృష్ణ మొగ మాట పెడ్తున్నాడు. ఆంధ్రాలో ఐరన్ ఫ్యాక్టరీకి బిర్లా చేతులుకలపమంటున్నాడు. వాళ్ళందరికి లైసెన్స్ వ్రాయాలి. లైసెన్సు ఉత్తరాలు కొట్టి అట్టిపెడు తుంది. నా సంతకాలు అవ్వాలి. పోస్టుచేయాలి.

రాణి : అర్జంటుపనులు. పోనీ వెళ్లిరండి.

పురు : మీలాంటివారికి ఎప్పుడూ అర్జంటుపనులు ఉం టూనే వుంటాయి. ఒక్కసారి యిల్లు.....

చిదా : పదండి. చూద్దాం....!

పురు : చాలా సంతోషం. రండి. (లోనికి వెళ్లాడు.)

చిదా : కాఫీ చాలా బాగుందండీ (కూడా వెళ్లాడు)

రాణి : బాగుంది.

గిరి : ఏమిటి ?

రాణి : బావా! అతను యిప్పుడు చెప్పిందంతా రైటే నంటావా ?

గిరి : అది వాణ్ణి పుట్టించిన బ్రహ్మకే తెలియాలి.

రాణి : కావ్యం వ్రాశాడు. దానికి వాళ్ల బాబు వ్రాసింది మాతృక.

గిరి : వాళ్ల తాత, ముత్తాత అందరూ వ్రాశారు. కాని అవేవీ లేవు. తగుల బెట్టేశారు.

రాణి : బావా! నీవు యిదంతా నమ్ముతున్నావా ?

గిరి : వాడు అంటున్నాడుగా.

రాణి : బావా బి. సి. రాయ్ ట్రీట్‌మెంటు, సర్వోదయా బ్యాంకులో డబ్బు, బంగారం రేటు, బిర్లాతో వాటా, మాచర్లలో మూట, నమ్మేవా బావా ?

గిరి : నమ్మీ నమ్మకుండా వుంటె.

రాణి : నాకు మట్టుకునాకు నమ్మకం లేదు.

గిరి : మావయ్యా నమ్ముతున్నాడుగా

రాణి : మోజులోపడితే ఆకళ్ల కాలాగే కనుపిస్తాయ్.

గిరి : నమ్మక చేసేదేమిటి ? నమ్మితే పోయిందేమిటి ?

రాణి : పిచ్చివాడవు బావా : వాడెక్కడ నాన్నకు మస్కా కొడతాడో !

గిరి : మనం వున్నాంగా. నీకా భయం లేదు.

రాణి : ఏమో నాకతన్నిచూస్తే అనుమానంగానేవుంది.

గిరి : ఎవరిగొడవ ఎలాగున్నా మనసంగతి మాత్రం మీనాన్న పట్టించుకోడు.

రాణి : పట్టేటట్టు మనం చేయాలి.

గిరి : ఏమిటి సూత్రం?

రాణి : మంగళసూత్రమే!

ముత్యా : (వీధిలోంచి వస్తూనే) పురుషోత్తంగారూ, ఓ! బావా మరదళ్లు...

గిరి : ఆశీర్వదించండి. (నమస్కరించాడు) [illegible]!

రాణి : (నమస్కరించింది)

ముత్యా : శుభంభవ! శీఘ్రమేవ కళ్యాణప్రాప్తిరస్తు.

రాణి : (సిగ్గుపడింది)

గిరి : ముత్యాలుగారు, క్షమించండి ముత్యాలరావుగారు మీ నోటివాఖ్యాన్ని రాణి, నేను...

(రాణి చెయ్యి పట్టుకొని దగ్గరకు తీసుకున్నాడు.)

రాణి : ఉండుబావా! (కాఫీకప్పులు తీసుకొని లోనికివెళ్లింది.)

ముత్యా : మీ మావయ్య

Rs. 1-50

గిరి : లోపల వున్నాడు.

ముత్యా : గిరీ! నీవుముఖ్యంగా చాలా అదృష్టవంతుడవోయ్

గిరి : మీనోటి వాఖ్యాన...

ముత్యా : అదీ. పెద్దలంటేగురివుండాలి. ముఖ్యంగా గురివున్న వాళ్లకు ఎప్పుడూ బ్రహ్మాండంగా మేలుజరుగు

తుంది. అవును గాని మీ మావయ్య ఏం చేస్తున్నాడూ ?

గిరి : పొరుగూరు పెద్దమనిషి...

ముత్యా : వచ్చాడా! మీయింటికి! ఒక్కడూ!

గిరి : అలా ఆశ్చర్య పోతున్నారేం ?

ముత్యా : అంత తేలిగ్గా మాట్లాడకు. ఆ మహానుభావుడు

రాణి : (లోపలనుంచి వచ్చింది) వస్తున్నారు.

ముత్యా : వస్తున్నారా ?

గిరి : (బయటకు వెళ్తున్నాడు)

ముత్యా : బయటకు వెడుతున్నావా ?

గిరి : మరేనండి. (వెళ్లిపోయాడు)

రాణి : చిదానందంగారు మీకు తెలుసా ?

ముత్యా : యీవేళే చూశానమ్మా.

రాణి : ఆయనగురించి మీ అభిప్రాయం :

ముత్యా : ఆ అపూర్వవ్యక్తి...

రాణి : ఏమిటండీ ఆయనలోవున్న అపూర్వం ?

ముత్యా : చెబితే నీకెలా తెలుస్తుంది. చూడాలి.

రాణి : చూచారుగా మీరు. చెప్పండి.

ముత్యా : ఆయనదాకా ఎందుకు ? ముఖ్యంగా ఆయనదగ్గర ఒక లేడీ టైపిస్టు వుంది. దాన్నిచూస్తేనే థంగై పోతాం. ఉల్లిపొరలాంటి చీరకట్టింది. డబుల్ జడలు వేసింది.

రాణి : నేనూ వేశాను.

ముత్యా : అవును. నేనింతవరకూ చూడనేలేను. ఎప్పుడొచ్చా లేంది యీవేళ ...

రాణి : మీరు ముత్యాలరావు అయ్యారు. మా నాన్నగారు ఉత్తమ్‌జీ అయ్యారు. నేను రెండు జడలు వేశాను. మా బావ టక్ చేశాడు. మరియింక ఏం ప్రళయం వస్తుందో.

ముత్యా : అమ్మాయ్ అంత దుందుడుకు మాటలు ఆడటం ముఖ్యంగా మంచిదికాదు, ఆ మహానుభావుడు ...

చిదా : (లోపలనుంచి వచ్చాడు.)

ముత్యా : అదిగో మాటలోనే వచ్చారు. నూరేళ్లు ఆయుష్యు

రాణి : నూటొకటి అనండి. భగవంతుడిచ్చిన నూరు ఏలాగూ వుండనే వున్నాయ్. మీరు కనీసం ఒకటైనా ...

చిదా : Too clever.

పురు : (లోపలనుంచి వచ్చాడు.)

చిదా : సెలవిప్పించండి. మీ గృహం, యిక్కడి వాతావరణం నాకు చాలా ఆనందాన్ని కలుగజేశాయి. ఉత్తమ్‌జీ వెళ్లి వస్తాను.

రాణి : తమయిష్టం. (తనగదిలోకి వెళ్లింది.)

చిదా : ఉత్తమ్‌జీ. అనుజ్ఞ యివ్వండి. (నమస్కరించాడు.)

పురు : పెద్దలు అంతమాట అనకండి. (నమస్కరించాడు.)

ముత్యా : నమస్కారం.

చిదా : వస్తాను. ( వెళ్లిపోయాడు )

ముత్యా : ఆహాఁ. ఏమినడకండి.

పురు : ఆ వినయం, ఆ నమ్రత, ఓహో !

ముత్యా : దొరతీవి కదండి.

పురు : మర్యాద తెలిసిన మనిషి.

ముత్యా : గొప్ప తెలివైనవాడు.

పురు : తెలివేమిటి : అమోఘం : అష్టావధానం చేస్తాడు. మనతో మాట్లాడుతూనే తన బిజినెస్ అంతా ఆలోచించేశాడు.

ముత్యా : చూశారా గిఫ్టండీ గిఫ్ట్.

పురు : చిదానందంగారిముందు మన తెలివి ఎన్నోవంతు.

ముత్యా : లక్షోవంతు వుండదు. తెలివికంటే ఆయనేముందు పుట్టాడు.

పురు : లక్షాధికారి బిడ్డ.

ముత్యా : కాబట్టే పెద్ద ఫ్యాక్టరీ కడుతున్నాడు.

పురు : అమెరికానుంచి మిషనరీ తెప్పిస్తున్నాడు.

ముత్యా : ఆ నిర్మాణ కౌశల్యం, ఆ వాక్ చాతుర్యం, ఆ కార్య చతురత...

పురు : ఏమయ్యోయ్ ! చిదానందంగారు బ్రహ్మచారట మాయిల్లుచూస్తూ మాటలసందర్భంలో తేలాడు.

ముత్యా : ఉదయం నేను వెళ్లినప్పుడు వాళ్ల లేడి టైపిస్టు యామాటే చెప్పింది.

పురు : నిజమేనన్నమాట.

రాణి : ( ఇంత క్రితమే వచ్చింది. పై సంభాషణ ఆమె వినిపించలేదు ) నాన్నా !

పురు : ఏం రాణీ.

రాణి : మీరిద్దరూ బట్రాజులను మించిపోతున్నారు. వంది మాగధులను తలదన్నేస్తున్నారు.

పురు : చిన్నపిల్లవు నీకెలా తెలుస్తుంది.

రాణి : నాకేం నమ్మకంలేదు.

ముత్యా : మేము తెలివి తక్కువవాళ్లమనా నీవుద్దేశ్యం ? పోనీ నామాట అలావుంచి ముఖ్యంగా మీనాన్న గారూ...

రాణి : ముత్యాలరావుగారికి ముఖ్యంగా తెల్లనివన్నీ పాలు. మానాన్నకి నల్లనివన్నీ నీళ్లు అంతే.

పురు : ఎందుచేత అమ్మాయ్.

రాణి : మీతో నేను వాదించను. ( తనగదిలోనికి వెళ్లింది. )

పురు : అమ్మాయితో ఏమిటిగాని, చిదానందంగారికియింకా పెళ్లి కాలేదు. నాకు అదే ఆశ్చర్యంగావుంది.

ముత్యా : అందుకే నేనో ఆలోచన చెప్పాను.

పురు : ఏమిటి ?

ముత్యా : ఆయన కులకట్టుబాట్లు పాటించడట. కాస్మాపాలిటన్. తనకంటికి నచ్చిన పిల్ల దొరికితే పెళ్ళిచేసుకుంటాడట.

పురు : నీకెలా తెలుసు ?

ముత్యా : ఇన్ఫర్మేషన్ లాగానండీ. వాళ్ల పైపిస్టు చెప్పింది మా అమ్మాయిని ఆయనకయిస్తే ఏలావుంటుంది?

పురు : బేషుగ్గా వుంటుంది.

ముత్యా : సరిగ్గా అదే మేము అనుకున్నాం.

పురు : మరి ఆయనతో మాట్లాడా ?

ముత్యా : యింకా సంప్రతించలేదండి.

పురు : మరి ?

ముత్యా : మా ఆవిడా నేను, అనుకొని వూరుకొన్నాం. ఇంక మీరు ఓ. కె. అంటె ఆయన ఓ. కె. అంటాడు. అప్పుడు పెళ్లి చేసెయ్యడమే. ఒప్పుకోనంటాడా ? ఆఁ ఒప్పుకుంటాడు. మా అమ్మాయికేం ? నేను పొగడకూడదుగాని, అందరూ పొగుడుతూ వుంటారు.

పురు : నచ్చితే మంచిదే.

ముత్యా : ప్రయత్నించమంటారా ?

పురు : నిరభ్యంతరంగా.

ముత్యా : మీరు ఆలా అంటే ఎలా ? ఏదో సలహా చెప్పి ప్రోత్సహిస్తారని వస్తే ...

పురు : అసలు మీ సమ్మతి ఆయనకి చెప్పండి. అప్పుడాయన అభిమతం. అటుపైన అనుమతి ...

ముత్యా : అయితే ముఖ్యంగా వెళ్ళొస్తాను. ఆలస్యం అమృ

తం విషం అన్నారు. యీ పెళ్ళి ఖాయం అయితే ఎవరెష్టు శిఖరం ఎక్కినట్లే. శెలవిప్పించండి.
(బయటకు వెళ్లి పోతున్నాడు.)

పురు : ఆగవయ్యా.

ముత్యా : ఏమండి? (ఆగాడు)

పురు : ఇలాగే వెళ్తావా? కాబోయే మావగారు ఏలా గుండాలి? ఠీవిగా వుండొద్దు? అందులోనూ చిదానందంగారిలాంటి మహావ్యక్తికి మావ అవ్వాలంటే ఎంతహుందావుండాలి? ఇదిగో అమ్మాయ్ రాణీ.

రాణి : వస్తున్నా నాన్నా (లోపలినుంచే అంది)

పురు : నా గ్లాస్కో పంచా, సిల్కు లాల్చీ, సిల్కు కండువా, ఒక సంచిలో పెట్టి తీసుకురా.

ముత్యా : ఎందుకండీ?

పురు : అమాయికుడవు. ఆమాత్రం అర్థంచేసుకోకపోతే ఎలా? అమ్మాయ్!

రాణి : తీసుకొస్తున్నా (లోపల్నుంచే మరల అంది.)

పురు : త్వరగారా. ఆకాశానికి భూమికి ముడిపెట్టాలని చూస్తున్నారు. పోష్టుమాష్టారూ మంచి ప్లాను వేశారు. ప్రియత్నించండి. మీ ప్రియత్నం మంచిదైతే మంచిఫలితమే వస్తుంది.

రాణి : (లోపల్నుంచి వచ్చింది) ఇదిగో నాన్నా!

(సంచి యిచ్చింది.)

పురు : ( సంచి అందుకొని ముత్యాలరావుకి యిచ్చి ) తీసుకువెళ్లండి

ముత్యా : ( తీసుకొని ) మళ్లీ మనం తాంబూలాల టైమ్‌లో కలుస్తాం.

పురు : శుభశ్య శీఘ్రం. వర్జ్యంలేకుండా వెళ్లండి. యిప్పుడు దుర్ముహూర్తంవుంది. వెళ్లండి.

ముత్యా : వస్తానండి. ( హుషారుగా బయటకు వెళ్తున్నాడు )

పురు : ముత్యాలూ.

ముత్యా : ( ఆగాడు )

పురు : ఏమిటా గెడ్డం ?

ముత్యా : ఏడుకొండలవాడికి యిచ్చేశాను. ఏడుకొండల వాడా ! వెంకటరమణా ! తండ్రీ నీదేభారం.

( బయటికి వెళ్లిపోయాడు )

రాణి : ఏమిటి నాన్నా ముత్యాలుగారి హడావిడి ?

పురు : ఆయనకెప్పుడూ హడావుడే. ( కలదిరుగుతున్నాడు )

రాణి : ( తండ్రి మాటలాడకపోవటంవల్ల నిరీక్షించకుండా లోనికి వెళ్లింది. )

పురు : ( ఏకాంతంగా ఆలోచించాడు. ఏదో ఆలోచన వచ్చింది. ఒక్కసారిగా కేక వేశాడు. ) రాణీ.

రాణి : ( కంగారుగా లోపల్నుంచి వచ్చింది. ) నాన్నా !

పురు : ( తాఫీగా మెల్లగా అన్నాడు. ) అమ్మా !

రాణి : ఏం నాన్నా ?

పురు : అమ్మాయ్ ! మనకో అద్భుతమైన ఆలోచన...

కాదు... అభిప్రాయం... కాదునిర్ణయమేతక్కింది. మనపొరుగింటి పెద్దమనిషి ఎటువంటివాడు ?

రాణి : చాలా వింతమనిషి.

పురు : కాదు. చాలావిసూత్నమైనవాడు, విద్యావంతుడు, దర్జాపురుషుడు, అందగాడు, మనకు తగ్గవాడు.

రాణి : అంటే ?

పురు : అర్థంకాలేదా పిచ్చితల్లి. బోధన్‌లో భూములు, మాచెర్ల ఫ్యాక్టరీలో షేర్లు, బిర్లాతో వాటాలు, బ్యాంకుల్లో డబ్బు, అన్నివున్నా దాన్ని అనుభవించేవాళ్లు లేరు.

రాణి : ఆయనకెవరూ వెనకదక్షత లేదా ?

పురు : ఉంటారు. కో అంటే కోటిమంది. బెల్లంవున్న చోట చీమలూ వుంటాయ్, కాని నా అనేవాళ్లు, తన స్వంతం అయినవాళ్లు ఏరి ? అంతమేడవుంది. ఆమేడకు అలంకారమేది ? ఆమేడలో వెలుగేది ?

రాణి . లేడీ సైపిస్టు.

పురు : ఛా. కూలికొచ్చిన ముండ. ఎవరికోసం ఆ దర్జా ? ఎవరికోసం ఆదర్పం.? ఎవరికోసం ఆ ఆస్థి ? ఆ వ్యాపారం, ఆ జీవితం అదంతా అతని జీవితంలో అర్థభాగం మాత్రమే ! సంపూర్ణ జీవితం అతనికి ప్రసాదించాలంటే, మనం భాగస్వాములంకావాలి.

రాణి : ఏమిటేమిటి ?

పురు : అవును. అతని జీవితానికి పూర్ణత్వం కావాలి. నీకు పెళ్లి కావాలి.

రాణి : నాకా పెళ్లి? నాన్నా! మీ అభిప్రాయం మార్చుకోండి

పురు : ఏం పెళ్లి చేసుకోవా?

రాణి : చేసుకొంటాను.

పురు : అయితే చేసుకో. మాట్లాడతాను. మాట్లాడట మేమిటి ఖాయపర్చుకొస్తాను. యిప్పుడే వెళ్తున్నాను. ఖాయం చేసేస్తాను.

రాణి : ఎవర్ని?

పురు : ఆ చిదానంద చిద్విలాస పురుషుడ్ని.

రాణి : నీకా శ్రమ అక్కర్లేదు. నేను బావనే చేసుకొంటాను.

పురు : బావా!

రాణి : అవును.

పురు : వాడా? దారి లేక మనింట్లో తలదాచుకున్న వాడ్నా? ఆస్తిపాస్తి లేకుండా మనపై ఆధారపడిన వాడ్నా, వృత్తి వ్యాపారం లేకుండా రికామీగా తిరిగే వాడ్నా? వీలుపడదు. పురుషోత్తంగారి అల్లుడంటే ఏ అంతస్థులో వుండాలి? ఏ హోదాలో వుండాలి?

రాణి : మీ అంతస్థులకోసం, మీ హోదాల కోసం మా జీవితాలు బలిచేయకండి నాన్నా! చిన్నప్పటి నుంచి ఒకచోట పెరిగాం. ఒకరినొకరం అర్థంచేసుకున్నాం. బావనీకుమాత్రం పరాయివాడా? పెళ్లి చేసుకోవాలనుకున్నాం.

పురు : కట్టిపెట్టు నీ వుపన్యాసం. నీకోసం చెప్తున్నాను. నీ సౌఖ్యం కోసం చెప్తున్నాను. నీ భవిష్యత్తు ఆలోచించి చెప్తున్నాను. డబ్బు, దర్జాలేనివాడికి పెళ్లి చేసి, మిమ్మల్ని నేనుచూడలేను.

రాణి : మనకున్న ఐశ్వర్యం చాలదానాన్నా?

పురు : తాహతుకు తగ్గవాడుకావాలి. అమ్మాయ్ చచ్చు దద్దమ్మతో సంబంధం ఏమిటి? నీవు మాట్లాడకు నోరుమూసుకొని పడుండు. (వీధిలోకి వెళ్తున్నాడు)

రాణి : నా న్నా (పెద్దగా కేకపెట్టింది. వెంటపడింది) వద్దు నాన్నా వద్దు. నీవే నాబాధ తెలుసుకోకపోతే నాకీప్రపంచంలోఎవరున్నారునాన్న? అమ్మేవుంటే ఇలా జరగనిచ్చేదా? నాకంట తడిపెట్టనిచ్చేదా?

పురు : మీా అమ్మేవుంటే నిన్ను ఆ పొరుగింటి పెద్దమని షికిచ్చి, తప్పక చేసేది. నాకు నీతో వాదించవల సిన ఖర్మ తప్పేది.

రాణి : వట్టిది. అమ్మ ఒక్కనాటికి అలా అనేదేకాదు.

పురు : పిచ్చితల్లీ! మీా అమ్మవుంటే నీపెళ్లికి అయిదు భోగంమేళాలు పెట్టించి ఊరంత పందిరి వేయించి పది బ్యాండు మేళాలతో ముత్యాలపల్లకీలో బ్రహ్మాండమైన వూరేగింపు చేయించేది. కోటీశ్వ రుణ్ణి తప్ప మనగడపలో కాలుపెట్టనిచ్చేదా? యీా అల్లుడ్ని చూస్తే ఎంత మురిసిపోయేదో. ఎంత ఆనంద పడేదో.

రాణి : కాదు ఏడ్చేది. మొత్తుకొనేది. డబ్బుకోసం ప్రేమ లేనిచోట విధించి బంధించటానికి ఒప్పుకొనేదా? అంతకన్నా పీకపిసికి చంపెయ్యమనేది. ఆడదానికి తెలుసు ఆడమనస్సు, మగవాళ్లకేం తెలుసు మిడిసి పాటు తప్ప. ఏమైనా యీ పెళ్లి జరగటానికి వీల్లేదు.

పురు : ఎంత మాటన్నావ్. నా చెవులారా ఎంతెంత మాటలు విన్నాను. అమ్మాయి నేనునీకు అన్యా యం చేయదల్చుకున్నానా? నా లుగంతస్థుల మేడలో అలంకరించుకొన్న నాకూతుర్ని చూడ దల్చుకున్నాను. నౌఖర్లు చాకర్లతో, ధనధాన్యా లతో తులతూగే యింట్లో నిన్ను చూడదల్చు కొన్నాను. నాకెవరున్నారీ ప్రపంచంలో నీవుతప్ప. ఒకే ఒక్క కూతురువి. నా బంగారు తల్లివి. నాకేదైనావుంటే సమస్తం నీదే. నా ఆశవునీవే. నా వెలుగువునీవే. నీకోసమే ఏత్యాగమైనా చేస్తాను. నిన్ను ధనంతో ముంచెత్తుతాను. నీవు ఏడ్చినా మొత్తుకున్నా నిన్ను మహావైభోగంతో అతని కిచ్చి పెళ్లిచేస్తాను. శిరిరా మోకాలడ్డకు. వెళ్లు. ఫో, లోపలికి.

గిరి : (బయటనుంచి వచ్చాడు.) మావయ్యా.

పురు : నోరుమూసుకొని గదిలోకి పో.

గిరి : ఎక్కడికి ?

పురు : శకున పక్షి. (వెళ్లిపోయాడు.)

గిరి : రాణీ! ఏమిటిది? మాట్లాడవేం?[చెయ్యిపట్టుకున్నాడు]

రాణి : (విదిలించుకొంది.)

గిరి : మాట్లాడితే మాణిక్యాలు రాలుతాయా ? నవ్వితే నవరత్నాలు రాలుతాయా ? ఆ. 'నవ్వితే నవ రత్నాలు, రవ్వాలురాలుజవ్వనీ'॥న॥[పాడుతున్నాడు]

రాణి : ఏమిటి బావా ! ఏం జరిగిందో ఆలోచించకుండా అల్లరి.

గిరి : ఏం మునిగిపోయింది ? ఎంతో ప్రేమతో నీమీాద పాట పాడుతూవుంటే అల్లరి అంటావ్ !

రాణి : ఇక పాడుదువుగాని బావా (కన్నీరు పెట్టుకొంది.)

గిరి : ఏడుస్తున్నావా రాణీ !

రాణి : ఏడుపుకాక మన బ్రతుక్కి ఇంకేముంది ?

గిరి : ఏం ?

రాణి : అబ్బ ! నీకర్థంకాదు.

గిరి : చెప్పరాదూ ?

రాణి : మా నాన్న ఎందుకు కేకలేశాడో అర్థంకాలేదా ?

గిరి : ఏదో కయాలీ వచ్చి వుంటుంది.

రాణి : కాదు. నన్ను ... బావా ఆపొరుగూరు పెద్దమనిషికి యిచ్చి పెళ్ళిచేస్తాడట.

గిరి : ఆఁ ! నిజంగానా ?

రాణి : అవును. అందుకే బయల్దేరి వెళ్లాడు.

గిరి : ఎక్కడికి ?

రాణి : ఆ పెద్దమనిషి దగ్గరకే.

గిరి : నేనేం కావాలి రాణీ ?

రాణి : నన్నడిగితే నేనేం చెప్పను ?

గిరి : మనిద్దరం ప్రేమించుకున్నాం అని చెప్పలేక పోయూవా ?

రాణి : అదీ అయ్యింది.

గిరి : అయినా కాదన్నాడా ? మరి ఏమిటీ దారి ?

రాణి : నీవే ఆలోచించు.

గిరి : నాకేం తట్టడంలేదు. ఆఁ. రాణీ వేళాకోళాని కన్నాడేమో ! ఆఁ అంతే నువ్వు అనవసరంగా గాబరా పడుతున్నావ్.

రాణి : బావా! ఎంత అమాయకంగా మాట్లాడుతున్నావ్. నీకు డబ్బు లేదట. దర్జాలేదట. అందుకని పొరు గింటి... (ఏడుస్తుంది.)

గిరి : ఆలాగ అన్నాడా ! నాఆస్థి ఏమైంది ? మానాన్న చచ్చిపోతూ బోలెడుఆస్థి యిచ్చాడట. అదంతా దిగమింగి నాకు డబ్బులేదంటాడా ?

రాణి : ఆవిషయం మా నాన్ననే అడుగు.

గిరి : అయ్యబాబోయ్: అడిగితేయింకేమయినావుందా ?

రాణి : చంపేస్తాడా !

గిరి : చంపడూ ? నేనుచిన్నప్పుడు మనదొడ్లో బత్తాయి చెట్టెక్కానని చచ్చేలా కొట్టాడు బెత్తంతోటి చూడు. ఆమచ్చ ఏలాగుందో. (చూపించాడు.)

రాణి : (చూడలేదు.)

గిరి : ఇందాకా నీవు కాఫీచెయ్యటానికి లోపలికి వెళ్లావు. నన్ను చెట్టెక్కి బత్తాయి కాయలు కొయ్య మన్నాడు. అలవాటు తప్పిందేమొ! ఎక్కలేక పోయాను. కాని తప్పదుగా. మావయ్యకు కోపం వస్తుందని ఎక్కాను. చీమలు కుట్టాయని దిగి చక్కావచ్చాను. ఆ పెద్దమనిషి ఉండబట్టిగాని లేకపోతే మళ్లీ తన్నేవాడు.

రాణి : ఇప్పుడు ఆ పెద్దమనిషే మన జీవితాలు నాశనం చేస్తున్నాడు.

గిరి : అయితే నీవు వాడ్ని పెళ్లి చేసుకుంటావా ?

రాణి : నేను చేసుకోవటంలేదు. మా నాన్న చేస్తానం టున్నాడు.

గిరి : నీవు వొద్దను.

రాణి : అన్నాను. మా నాన్న వినలేదు. పెళ్లిఖాయం చేసి, ముహూర్తము పెట్టించుకు మరీవస్తానని వెళ్ళాడు.

గిరి : అలా అయితే నేను వెళ్ళి ఆ పొరిగింటి పెద్దమని షితో "ఏమయ్యా! మా మరదలిని నీవు పెళ్ళి

చేసుకోటానికి వీలులేదు. రాణీ నేను ప్రేమించు కొన్నాం. ఏడు అంటె ఏడు మల్లెపువ్వులు తూగు తుంది. అటువంటి అమ్మాయిని నీవు...... ”

రాణి : బావా !

గిరి : ఆగా.

రాణి : సందర్భం లేకుండా మాట్లాడతావేమిటి ?

గిరి : అయితేమరి నన్నేం చేయమంటావ్ ? నీవు లేకుండా నేను బ్రతకలేను రాణీ. (కన్నీరు పెట్టుకున్నాడు.)

రాణి : బావా : నీవే కన్నీరు కారిస్తే ఎలా ? మగవాడివి. నాకు ధైర్యం చెప్పవలసింది పోయి... నీవు...

గిరి : రాణీ నాకుపిచ్చి ఎత్తేలావుంది. నన్ను ఎందుకూ పనికిరానివాడిగా పెంచాడు మావయ్య. కనీసం చెట్టెక్కటం కూడా చేతకాదు. ఒక్కమదురు గోడైనా దూకలేను.

ముత్యా : వీధిలోంచివచ్చాడు గ్లాస్కోపంచా, సిల్కులాల్చీ, ధరించాడు. బావామరదళ్లుఆలాగున్నారే? అరె? మాట్లాడరేం?

రాణి : మీరు వచ్చారేం ?

ముత్యా : అమ్మాయ్. నీకు చెప్పనేలేదు కదూ ! మా అమ్మా యికి పెళ్లి తాంబూలాలిద్దామని.

గిరి : ఎవరికి ?

ముత్యా : అదే గిరీ ! నేను మా అమ్మాయిని పొరుగింటి పెద్దమనిషికి యిచ్చి పెళ్లి చేయాలని నిర్ణయించు కున్నాను.

గిరి : మీరునా ?

ముత్యా : అంటే ?

రాణి : మాబావ మాటలకేంలెండి. మీరు చెప్పండి.

ముత్యా : యీ విషయం మీ నాన్నగారితో సంప్రదించాను.

గిరి : ఏమన్నాడు మావయ్య.

ముత్యా : ఫస్టుగావుంది. ప్రయత్నించమన్నారు. వార్ని కూడా తీసుకు వెడదామని వచ్చాను. ఒకసారి మీనాన్నగార్ని పిలు అమ్మా.

రాణి : (మాట్లాడక కూర్చుంది.)

ముత్యా : వర్జ్యం వస్తుంది. త్వరగా పిలమ్మా.

రాణి : మీరు మాకొంప ముంచారు.

ముత్యా : అదేమిటి ! ?

గిరి : చేస్తే నీకూతుర్ని యిచ్చి చెయ్యాలిగాని మా మావయ్యతో సంప్రదించమని ఎవరుచెప్పారయ్యా?

ముత్యా : కొంచెం గౌరవంగా మాట్లాడవయ్యా. చిన్నా–పెద్దా అన్నారు.

గిరి : ఏం చిన్నా పెద్దా అయ్యా ! మీరు మీ అమ్మాయిని ఆపొరుగింటి పెద్దమనిషికి యిచ్చి చెయ్యండి ఎవరు వద్దన్నారు ?

ముత్యా : నాకేం అర్థం కావటంలేదు.

గిరి : నీకెందుకు అర్థం అవుతుంది ? మాకొంప ముంచి
(తానుకూడా సోఫాలో కూర్చున్నాడు.)

ముత్యా : పోనీ నీవైనా చెప్పమ్మాయ్.

గిరి : (విసురుగా లేచాడు.) రాణి ఏం చెప్తుంది? మగవాణ్ణి యిక్కడ నేను వున్నాను. నన్నడగండి నే చెప్తాను.

ముత్యా : పోనీ నీవే చెప్పు.

గిరి : ముత్యాలరావుగారు... (ఏడుస్తున్నాడు) మావయ్యా మా రాణీని ఆ పొరుగూరు పెద్దమనిషికిచ్చి పెళ్ళి చేస్తాడట.

ముత్యా : ఆఁ. పెద్దమనిషికదా అని చెప్పటానికొస్తే ద్రోహం తలపెడతాడా? పిలవండి. నిలబెట్టి అడుగుతాను.

గిరి : ఇంట్లో లేడు. పెళ్లి ఖాయంచేసుకొస్తానని యిప్పుడే వెళ్లాడు.

పురు : (బయటనుంచి వచ్చాడు.) అమ్మాయ్! అమ్మాయ్!

గిరి : మావయ్యో!

పురు : పెళ్లి... (ముత్యాలునుచూచి ఆగిపోయాడు)

ముత్యా : ఆగిపోయారేం? చెప్పండి. పెళ్లి సెటిల్ చేశారా?

పురు : ఆఁ.

రాణి : నాకిష్టంలేదుయీపెళ్లి నాన్నా! యిక నన్ను పెళ్లికూతురుగా చూడవ్. నేనుకాదు ఊరేగేది. నా శవం.

పురు : రాణీ!

గిరి : రాణీ:

రాణి : (విసురుగా తనగదిలోకి వెళ్లింది.)

గిరి : మావయ్యా! ఏమిటీ ఘోరం?

ముత్యా : ఏమి టీ అత్యాచారం ?

పురు : ఏమీలేదు. పెళ్లి ! అంతే.

ముత్యా : పెళ్లి కాదు. దగా. మోసం.

పురు : ఎవరి అదృష్టానికి ఎవరుకర్తలు ? ఎవరికి ఎక్కడ రాసిపెట్టివుందో అక్కడ జరుగుతుంది. యోగం వుండాలి. నువ్వెందుకురా యిక్కడ ? ఛో !

గిరి : అవును పాపాలుచుట్టుకుంటాయ్. [తనగదిలోకి వెళ్లాడు]

ముత్యా : పాపమా, మహాపాపమా ? మాఅమ్మాయికి మాట్లాడతానని మీ అమ్మాయికి మాట్లాడుకోవటం ఏం పెద్దమనిషివయ్యా నువ్వు ? యింత మిత్రద్రోహం తలపెడతావా ? స్నేహితుడవని నీతో సలహాచేస్తే, నాకూతురు పెళ్లి చెడగొట్టి, నీకూతురికి బేరం వేసుకొన్నావా ? యింత దారుణమా ?

పురు : నేను చేసిందేమిటి ?

ముత్యా : యింకా ఏమిటి ! కొంపముంచి ఏమిటా ? నాకు సలహాచెప్పి నన్ను బట్టలు మార్చుకోమని, మావగారివని, దర్జాగా వెళ్లమని, దుర్ముహూర్తం వుందని, వర్జ్యంచూసి మరీవెళ్లమని, నన్నిలాపంపి యింత దగా చేస్తావా ?

పురు : లేదు. నీకోసమే చెప్పటానికి వెళ్లాను.

ముత్యా : ఆఁ. నాపీక కొయ్యటానికి వెళ్ళేవు.

పురు : మీఅమ్మాయి అతనికి నచ్చలేదంటే నాదాతప్పు?

ముత్యా : మా అమ్మాయి సంగతి అతనికేం తెలుసు ?

పురు : నీ మొగంచూస్తేనే తెలుస్తుంది. సాంప్రదాయం వుండాలి. ఎరువు దర్జాలుకావు.

ముత్యా : పైగా యిదొకటా? నీ సాంప్రదాయం మండి పోయిరి. నాపిల్ల పెళ్లి చెడగొట్టి నీపిల్లకుచేసుకోవటం సాంప్రదాయమా? కన్న తండ్రివికావా? బిడ్డల్ని కనలేదా? రాళ్లుకన్నావా? ముసలితండ్రికూట్లో దుమ్ముకొడతావా? విస్తరివేసిలాగేసుకొంటావా? కన్యదాని వుసురు కట్టుకొంటావ్! రౌరవాధి నరకాలనుభవిస్తావ్! స్నేహితుడివికాదు. ద్రోహివి. జూటాకోరువి. దొంగవి. దోపిడిగాడివి.

పురు : మాటలు సరిగా రానియ్!

ముత్యా : కళ్లు, కాళ్లు సరిగా వున్నేలా చూసుకో. మిడిసి పడకు. నీ కొంప గుండమైపోతుంది. నీ ఆస్తి నాశనమై పోతుంది. నీ కూతురు అల్లుడు నీకు కాకుండాపోతారు. నీవు అలో లక్ష్మణా అని ఏడుస్తూ కూర్చోకపోతే నేను చూస్తాను.

పురు : నోర్ముయ్:

ముత్యా : అంతదాకావచ్చిందా? ఈముత్యాలు నీగుండెల్లో మసుల్తాడు. చూస్తాను. (సురుగా వీధిలోకి వెళ్లిపోయాడు.

పురు : (కలవరిగాడు) అమ్మాయ్: రాణి!

రాణి : (వచ్చి మాట్లాడకుండా నుంచోంది.)

పురు : గిరీ! ఒరేయ్! గిరి! చవటా!

గిరి : (వచ్చాడు మాట్లాడలేదు.)

... తెర ...

# 2వ. రంగం.

( మొదటి రంగం మాదిరిగానే వుంది. ఎక్కడి వస్తువులక్కడ సంస్కార రహితంగా వున్నాయ్. )

పురు : ( కోటు సోఫామీదవుంది. టై విడివడివుంది. జుట్టు చిందర వందరగావుంది. నీరసంగా దిగులుగా సోఫాలోవున్నాడు.)

గిరి : (వీధిలోంచివచ్చాడు. చిక్కాడు. మాసినబట్టలతోవున్నాడు)

పురు : గిరీ !

గిరి : మావయ్యా

పురు : వచ్చేశారా ! వచ్చేశారా ?

గిరి : వచ్చేశాను మావయ్యా.

పురు : రాణేదిరా. రాణీ.

గిరి : రాణా ! ( గదిగుమ్మంవద్దకు వెళ్ళిచూచి, పిలిచాడు ) రాణీ! రాణీ. మావయ్య పిలుస్తున్నాడు. నేను వచ్చేశాను. ఉప్పుడుపిండివుంటె తెచ్చిపెట్టు. ఆకలేస్తోంది. అర్జంట్ ( క్యాలండరులో షీట్ మార్చాడు. వారంరోజులు జరిగినట్లు ఇప్పుడు తెలుస్తోంది. )

పురు : ( వీధిలో వుందేమోఅని చూసాడు. కనిపించలేదు. )ఒరేయ్ రాణీ ఏదిరా.

గిరి : పలకటంలేదుమావయ్యా. బెల్లంకొట్టినరాయిలాగ

పురు : నాటకాలాడకు. ఎక్కడికి వెళ్లావ్. రాణీ ఏది ?

గిరి : ఏం లేదా ?

పురు : ఎంత నంగనాచివిరా? తెలియనట్లు అడుగు తున్నావ్ రాణీ ఏది? చెప్పు.

గిరి : తెలియదు.

పురు : నీకు తెలియదు. ఊఁ. మరి నీవెక్కడికి వెళ్లావ్?

గిరి : రాణీనిచ్చి పెళ్లి చెయ్యనన్నావని కోపగించి వెళ్లి పోయాను.

పురు : ఎన్నిరోజులయ్యింది.

గిరి : వారం రోజులు.

పురు : సరిగ్గా ఆరోజు రాత్రినుంచే రాణి కనబడటంలేదు. ఆరాత్రి నువ్వూ వెళ్లావ్!

గిరి : అవును.

పురు : అయితేచెప్పు రాణీని ఎక్కడికి తీసుకువెళ్లావ్!

గిరి : నాకేం తెలియదు మావయ్యా!

పురు : పోనీ నీవక్కడవ్ ఎక్కడికెళ్లావ్?

గిరి : నాకు పెళ్లి చెయ్యనన్నావని తెగించి పట్నం పోయాను. కొట్టు కొట్టుకు తిరిగి ఉద్యోగం అడిగాను. ఏం చదివావని అడిగారు. E. S. L. C. తప్పాను అని చెప్పాను. అయితే యింటికెళ్లి రమ్మన్నారు మావయ్యా. అన్నంనీళ్లులేక అలమటించిపోయాను. లాగుచొక్కా మాసిపోయాయ్ నాల్గురోజులనుంచి స్నానం లేదు. ఆకలేస్తోంది. కళ్లు తిరిగి పడిపోయాను.

పురు : ఏడవలేక పోయావ్. నాకూతుర్ని అర్ధాన్నపు అడవిలోవదలి ఏడుస్తు యింటికొచ్చావ్. ఏది నాకూతురు? ఏది నారాణి!

గిరి : నేనేం ఎరగను.

పురు : ఆ ముత్యాలు, ఆ పోష్టు మాష్టరు. వాడెక్కడ?

గిరి : తెలియదు.

పురు : వాడూ యీ వారం రోజులనుంచీ కనబడటంలేదు.

గిరి : పాపం ఏమయ్యాడో!

పురు : అదే యిప్పుడు తేలాలి. వారం రోజులై రాణీ, నీవు వెళ్లిపోయారు. వారంరోజులైంది ఆముత్యాలు మాయమయ్యాడు. అందరూ ఒక్కసారే. దీనర్థం తెలియడంలేదా!

గిరి : నాకేం తెలుస్తుంది? చచ్చి నేనింటికొస్తే.

పురు : చావ్! నాకొంపకు మళ్లీ ఎందుకొచ్చావ్! రాణీ లేకుండా నీవు నాగుమ్మంలో అడుగుపెట్టావంటే కాళ్లు విరగేస్తా. ఫో.

గిరి : పోతా. రాణీలేని యీ యింట్లో ఒక్కనిముషం వుండను. కానీ లేకపోతే ముష్టెత్తుకు తింటాను. కన్న కూతురుకు స్థానంలేనిచోట మేనల్లుడెలా వుంటాడు. (వీధిలోకి వెళ్లబోతాడు.)

పురు : గిరీ! ఎక్కడికి?

గిరి : (ఆగాడు.) రాణీకోసం. (తిరిగి వెళ్లబోయాడు.)

పురు : ఆగు.

గిరి : ఏం ?

పురు : నారాణీని ఎక్కడికి పంపావో చెప్పి మరీకదులు.

గిరి : అవును నేనే పంపేశాను. కటికిపాషాణాన్నై పంపేశాను. కాదు తరిమేశాను. ప్రేమించినవాణ్ణి కాదని బలవంతపు పెళ్లి చెయ్యబోయి పారిపోయేలా చేశాను. దిక్కులేనిదాన్ని చేశాను. మావయ్యా నీకళ్లు చల్లబడ్డాయా ? వెళ్లొస్తా (వెళ్లబోతున్నాడు)

పురు : ఆగు. నాకర్థమైంది. ఒక్కమాటవిని వెళ్లు. ఒరే. రాణీ ఎక్కడుందో చెబితే పిల్లనిచ్చి పెళ్లిచేస్తాను. నామాట నమ్ము. చెప్పు.

గిరి : మావయ్యా.

పురు : చెప్పరా భయపడకుచెప్పు. గిరీమంచివాడవ్. చెప్పు

గిరి : తెలియదు.

పురు : నాపరువు మర్యాద మంటగలపకు. చెప్పు. చెప్పక పోతే నీచర్మం ఒలిచేస్తాను. (కర్రతీసుకొనికొట్టాడు)

గిరి : బాబోయ్.

పురు : చెప్పు. (మళ్లీ కొట్టాడు)

గిరి : అమ్మోయ్ పాతదెబ్బ. చంపెయ్యకు మావయ్య.

పురు : చంపుతానా. చీరి ఎండేస్తానా. నాకు కోపంవస్తే మనిషినికాదు చెప్పు. (కొట్టబోతున్నాడు.)

గిరి : (తప్పుకున్నాడు.) చచ్చాను బాబోయ్. నాకు తెలియదు మావయ్యా.

పురు : ఒరేయ్ (వంగదీసి గిరిని కొట్టాడు.)

గిరి : మావయ్యా ఎంతబట్టుపెడితే అంతబట్టు. పాతదెబ్బ

ముత్యా : (బయటనుంచి వచ్చాడు.) ఆగండి. ఆగండి. కుర్రాడ్ని అలా గొడ్డును కొట్టినట్టు కొడతారా?

గిరి : బాబోయ్ పాతదెబ్బ.

ముత్యా : ఎంతకోపం వుంటేమాత్రం ఆలా నిలువునా చంపు కుంటారా?

పురు : ఓరేయ్ ముత్యాలు (చొక్కా పట్టుకున్నాడు.) ఏమిట్రా పేలుతున్నావ్? నాగుమ్మం ఎవడుతొక్క మన్నాడు? ఎవడు తీర్పులు తీర్చమన్నాడు. (చొక్కా వదిలేశాడు.) నా మేనల్లుడు. నేను కొట్టు కుంటాను. ఇలారా గిరీ. రా. (చెవిపట్టుకున్నాడు.)

గిరి : బాబోయ్.

పురు : కొట్టుకుంటాను. చంపుకుంటాను. (వీపుమాద రెండు వేశాడు.)

గిరి : పాతదెబ్బ. అమ్మో.

పురు : నువ్వెవరవంట నన్నడగటానికి.

ముత్యా : ఎవర్నా — నీ పొరుగువాడ్ని. నీ స్నేహితుణ్ణి. పైగా గట్టిగామాట్లాడేవంటే బాల్యస్నేహితుడ్ని. అసలు నీవుచేసినపనికి నీగుమ్మం ఎక్కమనివుందా? మాయదారి ఉద్యోగం. (జేబులోంచి పేపరు తీసి టేబులుమీద వేశాడు. బయటకు వెళ్తున్నాడు.)

పురు : ముత్యాలరావ్.

ముత్యా : (ఆగాడు)

పురు : నాబాధ నీకేంతెల్సు. నేనసలే పిచ్చివాడ్ని అయ్యాను. నన్ను పలకరించకు.

గిరి : (నెమ్మదిగా లోపలకు జారుకున్నాడు.)

ముత్యా : ఏంబాధవచ్చింది?

పురు : మా అమ్మాయి.

ముత్యా : అమ్మాయి?

పురు : మా రాణీ.

ముత్యా : ఆ. మీరాణి?

పురు : కనుపించటంలేదు.

ముత్యా : సరి సరీ ఎప్పటినుంచీ?

పురు : వారంరోజులనుంచి. ఆపెళ్ళిఖాయంచేసిననాటినుంచీ

ముత్యా : మీ గిరికి ఏమైనా తెలుసేమో.

పురు : వాడూఆరోజునుంచి కనిపించటంలేదు. ఇంతక్రితమే వచ్చాడు.

ముత్యా : మరి అడిగారా?

పురు : అడిగాను. తనకేంతెలియదు మొర్రో అంటాడు.

ముత్యా : పాపం! అమ్మాయి ఏమైవుంటుందో!

పురు : అదే అర్థంకావటంలేదు ముత్యాలూ. ఆపొరుగింటి పెద్దమనిషి అడిగితే ఏమని సమాధానం చెప్పను. ఏ ముఖం పెట్టుకు మాట్లాడను? ముత్యాలూ

(రెండుచేతులు పట్టుకున్నాడు.) నీకుపుణ్యంవుంటుంది కాస్త భోగట్టాచేసి సాయంచేద్దూ.

ముత్యా : ఎవడిఖర్మకు ఎవరుబాధ్యులు. ఎవరియోగంలో ఎలావుందో ఎవరుచెప్పగలరు ? తానొకటితలిస్తే దైవమొకటి తలచాడు.

పురు : సందు దొరికిందికదా అని దెప్పుతావా ? స్నేహితుడవు కదాఅని సంప్రదించితే సాధింపు మొదలు పెడతావా ? నీబుద్ధి పోనిచ్చుకున్నావుకాదు. నీ కడుపులోవున్న విషంఅంతా కక్కుతున్నావ్.

ముత్యా : పోయేవాడ్నిఆపుచేసి, పరుషవాక్యాలు అంటావా! ఇదిగో మనకున్నబుద్ధే ఇతరులకు ఉందనుకోవటం ముఖ్యంగా పొరపాటు.

పురు : కాదయ్యా నా గ్రహపాటు.

చిదా : (వీధిలోంచి చాలా పేకెట్లతో వచ్చాడు.) Good Morning ఉత్తమ్‌జీ. పొరపాటు మావ్‌గారు. రావుగారు కూడా యిక్కడే వున్నారే. నమస్కారం.

ముత్యా : నమస్కారమండి. పట్నంనుంచేనాండి రాక.

చిదా : అవును. బండిసరాసరి మేడకుపోకుండా గుమ్మంలో ఆపి, తొంగిచూసి పోదామని వచ్చేశాను. అన్ని యేర్పాట్లు పూర్తిఅయ్యాయి. ఫ్రెండ్స్ అంతా ఎప్పుడు ఎప్పుడు అని ఎదురు చూస్తున్నారు. చెప్పలేక నానోరు పడిపోయింది. తెల్లవారే

టప్పటికి అంతా రెక్కలు కట్టుకు వాలుతారు. (చేకెట్లు విప్పుతున్నాడు.) బొంబే నుంచి వస్తూ ఏలాగు హనీమూన్‌కు రావాలికదాఅని ప్రధానంగా కావల్సిన Goods తెచ్చాను. ఫ్రాన్సు నుంచి నా ఫ్రండ్ అప్‌టుడేట్ సెలక్షన్ శారీస్ పట్టుకొచ్చాడు దాంట్లో Most beautiful శారీస్ వెతికి వెతికి తీశాను. ఇది బేగంపారా చీర. (ప్యాకెట్ విప్పి చీర చూపించాడు.) నూతన్ క్వాలిటీ స్ట్రిప్స్, నర్గీస్ అంచు, నదీరా నాణ్యం చూడండి. (జాకెట్ చూపిస్తూ) యిది యిటాలియన్ జాకెట్. గ్రేస్ కెల్లీ ఫేమ్. సెల్వానా హేండ్సు మాలాసిన్హా మెడ Wonderful quality. [మరో పాకెట్ విప్పిచూపించాడు యిది డబార్కర్ బ్రాసరీస్ ఆవా గార్డనర్ హేం డిల్సు మంగానా మోడల్ (మరో ప్యాకెట్ లోంచి కాలిజోళ్లుతీసి చూపించాడు.) హైహీల్ షూస్, వగైరా అన్ని శాంపిల్సు యింట్లోకొంచెం చూపించండి. ఫిటింగ్ గావుంటే శాటిన్ పేషన్ గావుంటుంది మావగారూ Don't think othervise. అనుమానించకండి. తీసుకువెళ్లి చూపించండి.

పురు : (ఇవి అన్నీ విసేస్థితిలో లేడు. ఏలా సమాధానంచెప్పాలా అని మదన పడుతున్నాడు.)

ముత్యా : (యీ అందమైన వస్తువులనుచూచి మరీ నోరూరింది. ఏలాగైనా యీపెళ్లి తప్పించాలి అని ఆలోచిస్తున్నాడు.)

చిదా : ఏమిటి యిద్దరూ నిలబడే దీర్ఘంగా ఆలోచిస్తున్నారు.

ముత్యా : ( సమయం దొరికింది. ) ఏమీ లేదు వారమ్మాయ్ ...

పురు : ముత్యాలూ !

ముత్యా : ఎందుకండీ దాపరికం. యిలా వినండి చిదానందం గారూ. మీకు వారమ్మాయి నిస్తానని సెటిల్ చేసుకున్నారా ?

చిదా : అవునండి. ఆతరువాతనే నేను పట్నం అర్జంటు బిజినెస్ మీద వెళ్లేను. యింతలోనే...

ముత్యా : అమ్మాయి. పురుషోత్తంగారి అమ్మాయి లేచి పోయింది.

పురు : ఒరే ముత్యాలు ఎంతమాట అన్నావురా.

ముత్యా : ఉన్నమాట అన్నాను.

పురు : అంటావ్. దవడ ఊడగొట్తాను.

ముత్యా : తొందరపడకు.

చిదా : ఏమండోయ్. ఏమిటి రేపు పెళ్లి గదా ?

ముత్యా : యింకేం పెళ్లండి ? పిల్ల లేందే.

చిదా : నా స్నేహితులు, చుట్టాలు అంతా తెల్లారేటప్పటి కొస్తారు.

పురు : మీరు కంగారు పడకండి.

ముత్యా : ఆ పెద్దమనిషిని కంగారుపడక ఏం చెయ్యమన్నారు. పాపం !

పురు : నీవు నోర్ముయ్.

ముత్యా : మాటలు వదులుతున్నావ్.

పురు : వాడు వట్టి పిచ్చాడండి.

ముత్యా : నిజం చెప్పిన వాడు పిచ్చాడు. తస్సాదియ్యా ముఖ్యంగా...

పురు : ఆగవోయ్ చిదానందంగారు. అతను చెప్పింది నమ్మతారా? నేనుచెప్పింది నమ్మతారా?

చిదా : మీరు చెప్పిందే.

ముత్యా : డబ్బున్నవాడుచెప్తేఠక్కునఅతుకుతుంది. అయినా మధ్య నాదేముంది. ముఖ్యంగా మీరిద్దరూ ఏకమైనప్పుడు.

గిరి : (లోపలినుంచి గట్టిగాతిని వస్తున్నాడు.) మావయ్యా సుబ్బమ్మ ఉప్పుడుపిండిఉప్మా ప్రోసెస్‌లో మహా బాగాచేసింది. చిదానందగారుమీరెప్పుడొచ్చేరు?

చిదా : Just. యిప్పుడే.

గిరి : మిమ్మల్ని చేసుకోటం యిష్టంలేక మారాణీ యింట్లోంచి పారిపోయింది.

చిదా : మీ మేనల్లుడు కూడా...

పురు : వాళ్లెవ్వరికీ తెలియదండీ.

చిదా : అసలు యింతకీ యింట్లోవుందా మీ అమ్మాయి?

పురు : లేనిమాటవాస్తవం. కాని మాఅమ్మాయి పట్నం వెళ్లింది.

గిరి : ఎందుకు?

ముత్యా : పెళ్ళి యిష్టంలేక.

పురు : కాదు.

చిదా : చెప్పండి.

పురు : చెబుతున్నా వినండి. మీరంతా వినండి. మా అమ్మాయి మా రాణీ తనతో చదువుకొన్న స్నేహితుల నందర్నీ స్వయంగాపిల్చి వస్తానంది. సరే పోయి రమ్మన్నాను.

గిరి : మావయ్యా !

పురు : నిజంరా.

చిదా : బ్రతికించారు. పదిమందిలో పరువు పోతుందను కున్నాను. పెళ్లి అంటే నాకసలు యిష్టమేలేదు. మొహమాటపడి మీమాట తీసేయలేకపోయాను.

పురు : అమ్మాయి యీ సాయంత్రానికే రావాలి. రేపు రాత్రికి పెళ్లిఖాయం. యీమాటకు తిరుగులేదు. మీరురండి. టిఫిన్ తీసుకొందాం.

చిదా : ముత్యాలరావుగారూ.

ముత్యా : మీరు వెళ్లండి. నేను యిప్పుడే తిన్నాను.

చిదా : లైట్ టిఫిన్ అయితేనే. I Can't take much

పురు : దయచేయండి. (లోనికి వెళ్లాడు.)

చిదా : (కూడా వెళ్లాడు.)

ముత్యా : డోకా డోకా తినిపిస్తున్నాడు.

గిరి : ఏమండీ మా మావయ్య...

ముత్యా : అఖండుడయ్యా. తెలివికంటె ముందుపుట్టాడు. చాణుక్యుడు మీ మావయ్యముందు బలాదూర్. తెలుసా ?

గిరి : అదికాదండీ. ఒకవేళ మారాణీ నిజంగా పారిపో లేదేమొ.

ముత్యా : అమాయకుడా ! శుద్ధ అమాయకుడా యిలావిను చెబుతాను.

గిరి : ( చెప్పండి అన్నట్లుగా దగ్గరకు జరిగాడు. )

ముత్యా : ఇంతకిత్రితం ఆ పొరుగూరు పెద్దమనిషి...

గిరి : ఇప్పుడు లోపలికి వెళ్లాడు...

ముత్యా : ఆఁ. అతనే రాకముందు నా రెండుచేతులు పట్టు కుని ముత్యాలూ యీ ఆపదనుండి బయటపడేయ్ నాకొంప కూలిపోయింది. నన్ను గట్టెక్కించు అని ఒకటే దేవుళ్లాడాడు.

గిరి : బాపురె మన్నాడా !

ముత్యా : బాపురమన్నాడా? భోరున కుంభవృష్టిగాఏడ్చాడు.

గిరి : నిజంగా !

ముత్యా : నీవు లోపల ఉప్పుడిపిండి తింటున్నావ్.

గిరి : ఉప్పుడి పిండికాదు ఉప్మా.

ముత్యా : ఏదో తింటున్నావ్. లేకపోతే చూసివుండేవాడవ్.

గిరి : మంచి ఛాన్సు పోయింది. ఆకలేసి లోపలికివెళ్లి ఉప్పుడుపిండి, కాదు ఉప్మాలో పడ్డాను. సుబ్బమ్మ

బాగాచేసింది. మీరుకూడా కాస్త తినరాదూ? రాణీవుంటె దెబ్బలాడి తినేది.

ముత్యా : ఇంత అమాయకుడవు కాబట్టే మీ మావయ్య నీ ఆస్తి కాజేసి, నీకు పిల్లనివ్వకుండా క్షవరంచేసి విడిచిపెడుతున్నాడు.

గిరి : గట్టిగాఅనకండి. కడుపుమండివున్నాడు. కర్రపట్టు కొస్తాడు.

ముత్యా : నాకంటే పెద్దరౌడీ మనవూళ్లోలేడు. మన చిన్న తనంలో తెలుసా? కాని నిన్నుచూస్తే నాకు జాలేస్తోంది. నేను మీరాణీకి, నీకు పెళ్లిజరిగే ఉపాయం చెప్తాను. చేస్తావా?

గిరి : చెప్పండి. ఉంకించి, లంఘించి చేస్తాను. ఒక్క చిటికిలోచేస్తాను. మా మావయ్య చచ్చిపోయాక ఆస్థినాకు వస్తుందిగా. మా రాణీని ఒప్పించి. నీకో పదివేలు బహుమతి యిప్పిస్తాను. మీ అమ్మాయి పెళ్లిచేయిస్తాను. నువ్వెన్నికార్డులు కొనమంటే అన్ని కార్డులు కొంటాను.

ముత్యా : చెబుతా. యిలారా. మళ్లీవాళ్లకు వినపడేను.

గిరి : అయితే నాగదిలోకివెళ్లి మాట్లాడుకుందాంరండి.

ముత్యా : ఎందుకయినామంచిది గోడకుచెవులుండొచ్చుపద.

గిరి : (తనగదిలోకి వెళ్లాడు.)

ముత్యా : (కూడా అనుసరించాడు.)

(కొన్ని క్షణాలు గడిచాయి)

పురు :
చిదా : } (లోపలనుంచి వచ్చారు)

చిదా : ముత్యాలరావుగారు వెళ్లిపోయినట్లున్నారు. మరి మావగారు శెలవా ? (నమస్కరించాడు.) మీ అమ్మాయి రాగానే యీ శాంపిల్స్ చూపండి.

పురు : అల్లానే (నమస్కరించాడు.)

చిదా : (వెళ్లేవాడు ఆగాడు.) మీ అమ్మాయి రాగానే కబురు పంపండి. లేదా నాకారు వేసుకొని పట్నం వెళ్లిరండి.

పురు : అఖ్కర్లేదు. సాయంత్రానికల్లా వచ్చి వాల్తుంది.

చిదా : అయితే వచ్చాక కబురుపంపండి.

పురు : వెళ్లిరండి.

చిదా : (వెడుతున్నాడు.)

ముత్యా : (గదిలోంచి వచ్చాడు.) ఓ చిదానందంగారూ వెళ్తున్నారా ?

చిదా : మీరు యిక్కడే వున్నారా ?

ముత్యా : ఉన్నాను. నేను వస్తున్నాను. ఆఁ మరచిపోయాను. యిదిగోనండి ఉత్తరం జేబులోనే వుండిపోయింది. (యిచ్చాడు.)

పురు : (ఉత్తరం అందుకొని చింపాడు.)

గిరి : ఎక్కడనించి మావయ్యా ?

పురు : (ఏకాగ్రతతో చదువుతున్నాడు.) నాకుతగ్గ కూతురు (నవ్వుతున్నాడు.) నాహోదాకు తగ్గ కూతురు.

గిరి : మావయ్యా !

చిదా : ఎక్కడనుంచండీ ?

పురు : అమ్మాయి వ్రాసింది. చదువుతా వినండి. నాన్న గారూ నమస్కారం

చిదా : Most simple

పురు : మా అమ్మాయంటే ఏమిటనుకున్నారు. ముత్యాల రావుగారు మీరుచదవండి. (ఉత్తరంయివ్వబోయాడు)

ముత్యా : నాజోడు తెచ్చుకోలేదు. మీరే చదవండి.

గిరి : నేను చదవనా మావయ్యా ?

పురు : (యిచ్చాడు.)

గిరి : పట్నం చేరాను. ఒక కోటీశ్వరుణ్ణి కట్టుకున్నాను.

పురు : కట్టుకుందా ? కలుసుకుందా ? చవటా ! సరిగా చదువు.

గిరి : టకార, ఉకార, ద్వైకారములు టు. ట, మరినన్ను ప్రేమించింది.

చిదా : నాకు మాటయిచ్చారు.

గిరి : మావయ్య మీకు మాటయిస్తే, రాణి నాకు...

పురు : గిరీ !

గిరి : మావయ్యా !

ముత్యా : చదువు.

గిరి : నాకళ్లు గిర గిరా తిరుగుతున్నాయ్. మావయ్యా చదవలేను క్షమించండి.

చిదా : ఏమిటి? పెద్దమనిషి చేయాల్సిన పనేనా యిది?

పురు : (నవ్వుతు) కోపగించుకోకండి. ఎవరిస్వార్థం వారిది. నా మేనల్లుడికంటె గొప్పవారని మీకు చేద్దామనుకొన్నాను. మీకంటె గొప్పవాడ్ని కోటీశ్వరుడ్ని మా అమ్మాయి ఫారిన్ నేట్‌గా చేసేసుకుంది. ఎవరిజాతకాలు ఎవరుమార్చగలరు?

చిదా : మీ జాతకాలు పాతరేయిస్తాను. నాతోటా వేళాకోళం?

ముత్యా : అతనితో మీకేమిటి? మీరు కావాలంటే కోటి మంది. కావాలంటే నాకూతుర్నే చేస్తాను. వాళ్లమ్మాయి, మా అమ్మాయిముందు బలాదూర్. రేపటిముహూర్తాని కేవమంటారు? అసలుయివ్వంటే యిచ్చేవాడ్ని కాదు. పట్టుదలకొద్దీ యిస్తున్నాను.

చిదా : Shut up. ఆగు. మీరందరూకలసి నాటకం ఆడతారా నాటకం యింట్లోమనిషిని, ఐశ్వర్యవంతుణ్ణి. వీధిలోకిలాగి అవమానిస్తారా? చూస్తాను. డిఫర్మేషన్ సూట్ తెస్తాను. మీసంగతి తేలుస్తాను.

(చీరలు వగైరా తీసుకొని జోరుగా వెళ్లిపోయాడు.)

పురు : (గిరి చేతిలోని ఉత్తరం లాక్కొని, ముత్యాలుకుయిస్తూవున్నాడు.) ముత్యాలు మా అమ్మాయి లేచిపోయింది చూశావా వుత్తరం?

ముత్యా : (ఉత్తరం తీసుకోలేదు.) విన్నాను. (తొందరగా బయటకు వెళ్లాడు.)

పురు : ఏరా గిరి! (సోఫాలో కూర్చున్నాడు.) రా. యిలా రా కూర్చో!

గిరి : (భయపడుతూవచ్చి కూర్చున్నాడు.)

పురు : ఏరా అలా భయపడుతున్నావ్? ఏమిటిసంగతి?

గిరి : ఏమీలేదు. నిన్నుచూస్తే భయమేస్తోంది.

పురు : భయంలేదు. అరే! ఎంతచిక్కిపోయావురా. యిందాకటినుంచి కానలేదు. నీకు మంచి పిల్లనుచూసి పెళ్లిచేస్తాను. గిరి ఉప్మాతిన్నావుకదూ. ముత్యాలు నీవు గదిలో ఏమిటిరా మాట్లాడుతున్నారు?

గిరి : ఏమీలేదు.

పురు : చెప్పరా! కష్టం సుఖం నాకునువ్వు నీకునేను చెప్పకోకపోతే ఇంకెవ్వరితో చెప్తావ్‌రా?

గిరి : ఏమీ లేందే.

పురు : లేకపోవటమేమిటి! ఉ. చెప్పు.

గిరి : డబ్బు!

పురు : ఎవరిది?

గిరి : నాది.

పురు : ఎవరిదగ్గర?

గిరి : మీదగ్గరే!

పురు : ఎంత?

గిరి : మానాన్న యిచ్చిందంతా లేదూ.

పురు : మీనాన్న యిచ్చాడని వాడుచెప్పాడా నీకు ?

గిరి : లేదు.

పురు : అయితే అడగమన్నాడా ?

గిరి : లేదు. నేనే అడుగుతున్నాను. కష్టంసుఖం మీతో మాట్లాడుతున్నాను. చెప్పండి మానాన్న చచ్చిపోతూ ముప్పైవేలు మీచేతికిచ్చాడు.

పురు : నీవు చూశావా ?

గిరి : చూస్తేం ? చూడకపోతేనేం ? ఆడబ్బుతోటేగా 15 ఎకరాలు పల్లపు పంపు కొంది...

పురు : పోనీ ఆలాగే అనుకుందాం.

గిరి : అనుకోవట మేమిటి ? కొంటేనే.

పురు : కొన్నానురా ! ఓరి గిరీ. నీపేరకాదు. నాపేర. తెలిసిందా? అయినానిన్ను అన్యాయం చెయ్యను.

గిరి : అయితే పడేయండి.

పురు : పడేస్తాను. పాతికేళ్లు ప్రేమతో పెంచితే చివరకు నాకంటె ఆ ముత్యాలుగాడు ఎక్కువా ? ఒరే. నీకునాకు సంబంధంలేదు. చవటా ! నీ చిన్ననాటి నుంచి ఈరోజువరకు నీకు ఎంతఖర్చు అయిందో లెక్కచూసుకొని నీకు రావలసుంటే పట్టుకెళ్లరా. విశ్వాస ఘాతకుడా. మాట్లాడవేం. ?

గిరి : మీరే చెప్పండి.

పురు : మీనాన్న పోయి ఎన్నాళ్లయింది?

గిరి : ఇరవై ఏళ్లు.

పురు : సరే రోజుకు మనిషికి హోటల్లో మంచి భోజనం ఎంత? రెండురూపాయిలు. అవునా? మరి నెల కెంత?

గిరి : అరవై.

పురు : టిఫిన్‌కి సాదరికి రోజుకో రూపాయి వెయ్యి. నెల కెంత?

గిరి : ముప్పై.

పురు : లాడ్జింగు రోజుకి రూమ్ రెంట్ ఎంత?

గిరి : సింగిల్ రూమా?

పురు : సరే అక్కడికే వేసుకో.

గిరి : రెండు రూపాయలు చొప్పున నెలకు అరవై.

పురు : భోజనం అరవై. కాఫీ వగైరా ముప్పై. రూమ్ రెంట్ అరవై. మొత్తం ఎంత?

గిరి : నూట ఏభై.

పురు : నెలకి ఒకమనిషికి నూటఏభై. అది అలావుంచు సంవత్సరానికి నెలలెన్ని?

గిరి : పన్నెండు— పన్నెండు ఇంటు నూటఏభై. దట్ ఈక్వల్‌టు పద్దెనిమిది వందలు.

పురు : సంవత్సరానికి మందులు మాకులు రెండువందలు అవుతాయంటావా?

గిరి : అవ్వకేం. అవుతాయి.

పురు : పద్దెనిమిది వందలకి ఆ రెండువందలు కలుపు.

గిరి : రెండువేలు. దాన్ని 20 పెట్టి గుడించాలి. అప్పుడు నేను ఈ ఇంట్లో 20 సంవత్సరాలు బ్రతికినందుకు అయిన మొత్తం నలభై వేల రూపాయిలు అవుతుంది. అంతేనా ?

పురు : తెలివైన వాడివి. నీచదువు చట్టుబండలకు అయిన మొత్తం కలపలేదు. నీ ఆస్థి మీ బాబు యిచ్చింది ముప్పైవేలు. పోనీ దానిమీద రాబడికూడా వేసుకో ఒక పదివేలు— సరిపోయిందా ? ఒరేయ్. యిందులో చాకలికి, క్షవరానికి...

గిరి : తిరుపతి వెళ్లిందానికీ !

పురు : ఇంతకాలానికి నన్ను లెఖ్ఖలడుగుతున్నావా ? లెఖ్ఖలు ! నా చెల్లెలుచచ్చి ఏస్వర్గాన్నుందో పసిగుడ్డును నిన్ను నా చేతుల్లో పెట్టి నీబిడ్డగా చూడన్నయ్యా అని ప్రాణాలొదిలింది. అప్పటి నుంచీ... (కన్నీరు పెట్టుకున్నాడు.)

గిరి : బాధపడకు మావయ్యా ! బాధపడకు ! నీ గణిత శాస్త్ర పాండిత్యమంతా నా ఆస్థిమీద ప్రయోగించావ్. చిత్రగుప్తుడ్ని చిత్తుచేశావ్ మావయ్యా! ఇకనిన్ను నా జీవితంలో లెక్కలడగను. చాలా ? మా అమ్మనన్ను నీచేతుల్లో పెట్టినందుకు స్వర్గాన్నుంచి ఆమె తల్చుకు తల్చుకు తృప్తిపడేలా

చేశావ్ !... రాణిని నాకు చేస్తావని, నా దేనీదని, నీ దేనాదని తలచి యింతకాలం నిన్ను లెఖ్ఖలడగ లేదు. బుద్ధివచ్చేలాచెప్పావ్.( లెంపలు వేసుకుస్నాడు)

పురు : గిరీ !

రాణి : ( బయటనుంచి వచ్చింది. చాలా అధునాతనంగావుంది. ) బావా !

గిరి : ( దగ్గరకు వెళ్లబోయి ఆగాడు ) రాణీ.

పురు : అమ్మాయ్, వచ్చావా ? నీవుత్తరం యింతక్రితమే అందింది.

రాణి : నాన్నా !

గిరి : మీా ఆయనేడీ ? క్షేమమా.

రాణి : బావా !

గిరి : ఆకోటీశ్వరుడు, ఎక్కడనుంచిదిగివచ్చాడు. వాడ్ని ఎక్కడ దాచావు ?

రాణి. : అసలు నీవడిగేదేమిటి బావా ?

పురు : కాస్త వూపిరి తీసుకోనిస్తావా ? ప్రయాణ బడలికతో అలసిపోయింది. రా అమ్మా రా. రాణీ కూర్చో.

రాణి : ఏమిటి నాన్నా !

గిరి : అబ్బ ! ఏమిటా ! ఏమీా తెలియని నంగనాచిలా.

పురు : ఒ రే య్. ( గుమ్మందగ్గరకువెళ్లి ) సు బ్బ మ్మా! అమ్మాయ్ వచ్చింది నీళ్లూ అవీచూడు.

గిరి : ఈ కోటీశ్వరుడి పెళ్ళాంగారికి.

రాణి : బావా! నాకేం అర్థంకావటంలేదు.

గిరి : అర్థంకావటంలేదు (పురుషోత్తంచేతిలో ఉత్తరంలాక్కొని చూపించాడు) ఏమిటి యిదిచూడు.

రాణి : (ఉత్తరం చదివింది) ఇది మీకెలావచ్చింది?

గిరి : నీవు వ్రాసి పోష్టులో వేస్తే రాకేంచేస్తుంది.

పురు : ఏమిటోయ్ నీ దండోరా?

గిరి : నా ఆస్థి నాకు పడేయండి. నీ కూతురు, నీవు కట్ట కట్టుకొని వూరేగండి.

పురు : ఒరేయ్. నీకు లెఖ్ఖలుచెప్పి నాల్గు నిమిషాలు కాలేదు. మళ్లీ ఆస్థేమిటి?

రాణి : బావేకదా నాన్న! అడుగుతుంటా

గిరి : అడుగుతానా, మళ్లీఅడుగుతానా.

పురు : కొంచెం తమాయించవోయ్. అమ్మాయి స్నానం చెయ్యి వెళ్లు.

రాణి : యిప్పుడేం అక్కరలేదు నాన్నా. బావా ఆలా చిక్కిపోయావేం?

గిరి : చిక్కితే నీకేం: సొక్కితే నీకేం:

రాణి : అంతకోపం ఎందుకు బావా? నేనేంచేశాను?

గిరి : ఉత్తరం.

రాణి : నేను వ్రాయలేదు.

పురు : నిజంగానే!

గిరి : నీకు పెళ్లి కాలేదా !

రాణి : మానాన్నకు వ్యతిరేకంగా నేను ఏపనిచేశాను? ఇంతకాలం నన్ను పెంచి పెద్దచేసినందుకు ఈ మాత్రం కృతజ్ఞత చూపించకుండా ఏలావుండ గలను? అందులోను పెళ్లా ? ఆమాత్రం జ్ఞానం నాకులేదా ? మీారెల్లానమ్మారు ?

పురు : సెబాష్. పులిపిల్ల పులిపిల్లే : అమ్మాయ్.

గిరి : మావయ్యా. మరి... మరి.

పురు : ఏమిట్రా ?

రాణి : బావ ఏదో చెప్పుతున్నాడు. చెప్పనీ. చెప్పుబావా.

గిరి : మావయ్యకు కోపం వస్తుందేమో.

రాణి : రాదు. చెప్పు బావా. చెప్పమను నాన్నా.

పురు : చెప్పరా. సందేహమెందుకు.

గిరి : తీరాచెప్పాక చెయ్యనంటే.

పురు : అనను. చెప్పు.

గిరి : అయితే చెపుతాను. మరి. .మరి మావయ్యా ఆ పొరుగింటి పెద్దమనిషితో రాణి సంబంధం తెగ తెంపులు అయ్యిందిగా. ఇక రాణికి నాకుపెళ్లి చేసెయ్యకూడదా అని.

పురు : (మాట్లాడడు.)

రాణి : ఏం నాన్నా.

పురు : మాట అన్నాక తిరగటం నావల్లకాదు. రాణీ నీవు

నామాట వింటావని అనుకున్నాను. అయినా నీకింత వయస్సు వచ్చేవరకు పెళ్ళి చెయ్యకుండా వుండటం నాదేతప్పు. అల్లారుముద్దుగా పెంచాను. యింతటిదాన్ని చేశాను. యిప్పుడు నాకు ఎదురు తిరుగుతున్నావ్. నేను పదిమందిలో తలఎత్తుకొని ఎలాతిరగను? అమ్మా రాణి!

రాణి : నాన్నా మీయిష్టప్రకారమే కానివ్వండి. మీ మనస్సు బాధపెట్టడం నా వుద్దేశ్యంకాదు.

పురు : సెభాష్! నాకూతురువనిపించావ్. రాణీ మాటల్లో మరిచ్చాను. యీవారం రోజులు ఎక్కడికెళ్ళావ్? ఎక్కడవున్నావ్?

రాణి : నాన్నా యీపెళ్ళి యిష్టంలేక, బావకు ద్రోహం చేయలేక, మనస్సువిరిగి, ఒక స్నేహితురాలి యింటికి వెళ్ళాను. ఆస్నేహితురాలు "తండ్రిమాటను కాదనటం తప్పని, ఎన్నెన్నోవిధాల చెప్పింది. పెద్దలమాటను పాటించక చెడ్డవాళ్ళున్నారు, పాటించి తరించినవాళ్ళూ వున్నారు. అనుభవంలో అర్థం అవుతుంది. ఆవేశంలో ఆలోచనతప్పకు" అని జ్ఞానోపదేశం చేసింది. గ్రరున తిరిగి యింటికి వచ్చాను.

గిరి : ఆ తలచెడిందెవరు?

పురు : నువ్ నోర్ముయ్. యీ ఉత్తరం ఎవరు వ్రాశారంటావ్?

రాణి : ఏమోమరి.

పురు : (కవరు పరికించాడు.) యీవూరి ముద్రే వుంటా. ఆరి దొంగ ముండాకొడకా. ఆ ముత్యాలుగాడి పనే యిది.

గిరి : ఆయన్ని ఎందుకు అనుకోటం!

పురు : మరెవర్ని అనాలి? నిన్నా? కబడ్దార్. తిన్నగా మాట్లాడు.

రాణి : బావను అలా అనకు నాన్నా.

పురు : అమ్మాయి చెప్పిందికాబట్టి యీపట్టుకి వూరుకొంటున్నాను. ఆపెద్దమనిషితో మాట్లాడి వస్తాను. నీవువచ్చాక రమ్మన్నాడు. యీపాడుత్తరంచూసి, ఆయనమనస్సునొప్పించితిప్పేశాను. నువ్వువిశ్రాంతి తీసుకో. నేనువస్తాను. (వీధిలోకి వెళ్లబోతున్నాడు.)

గిరి : నీ కూతుర్ని చెయ్యకపోతే పోయావు. నాడబ్బు నాకుపడేయ్. నేనెక్కడికైనాపోతాను. నీకూతురు తలదన్నిందాన్ని చేసుకుంటాను.

పురు : నీకు డబ్బుకావాలా? తలదన్నిన పిల్లకావాలా? మాట్లాడవేం?

రాణి : బావా! నీడబ్బుకి వడ్డీతోసహా తీసుకొందువుగాని నాపెళ్లికి నువ్వుండాలి. నువ్వులేకపోతే నేను పెళ్లి చేసుకోను. ఉండుబావా!

పురు : ఆలాచెయ్.

గిరి : చేస్తాన్లే. (కోపంగా తనగదిలోకి వెళ్లాడు.)

పురు : చూస్తానులే. ఆకోటు యిలా ఇయ్యి అమ్మాయి.

రాణి : అలా అనకున్నావా బావ చాలామంచివాడు. ( కోటు యిచ్చింది. )

పురు : నాకు తెలియదా వాడిబుద్ధి. ఆముత్యాలుగాడిమాట వినిఇలా పేట్రేగిపోతున్నాడు. ( కోటుతొడుక్కున్నాడు )

రాణి : ఇందులో ఒకరిమాట వినేదేముంది ? ముప్పైవేలు దాకా బావడబ్బు మనదగ్గర వుందిగా ?

పురు : అణాపైసలతో జమాఖర్చులున్నాయి. ఆగోడవ కేంగాని, నేను వెళ్లొస్తాను. ( వీధిలోకి వెళ్లాడు )

రాణి : ( గదిగుమ్మం దగ్గరకు వెళ్లింది. ) బావా ! పెళ్లికూతురు లాగా గదిలో కూర్చున్నావేం ?

గిరి : నీకుసిగ్గులేదు? ( లోపలినుంచి జోరుగాబయటకువచ్చాడు )

రాణి : కోపంగా నిన్ను ఎప్పుడూ చూడలేదు. ఎంత అందంగావున్నావు బావా ? నామీద కోపంఎందుకు చెప్పు ?

గిరి : రాణీ ! నీవునన్ను ప్రేమించలేదా ?

రాణి : లేదని నేను అన్నానా ?

గిరి : మరి యిప్పుడు ...

రాణి : యిప్పటికీ ప్రేమిస్తున్నాను. పంచభూతముల సాక్షిగా నిన్నే ప్రేమిస్తున్నాను.

గిరి : మరి అయితే ఆపొరుగింటి పెద్దమనిషిని పెళ్లిచేసుకొంటావేం ?

రాణి : నేను చేసుకోంటున్నానా? మా నాన్న చేస్తు న్నాడుగాని.

గిరి : వద్దని ఎందుకు ఎదురుచెప్పవ్?

రాణి : నేను చెప్పాలా? మ గా డి వి నీ వు మా ట్లా డ క కూర్చుంటావా?

గిరి : నేనడగవలసినవి నాల్గు నీ మొదటే అడిగాను. నామాట మావయ్య వినటంలేదు.

రాణి : అనినువ్వూవూరుకో నేనుమానాన్నను వ్యతిరేకిస్తాను మగాడివి. సిగ్గులేదు. నిన్నుకాదని, నీప్రియురాల్ని ఎవడో తన్నుకు పోతూవుంటే చూస్తూకూర్చో. నేను వద్దంటాను. మాట్లాడవేం? బావా?

గిరి : అయితే నాతోవస్తావా? ఎక్కడికైనా వెళ్లి పోదాం. మీబాబులాంటివాళ్లు లేని లోకంలోకి పోదాం. ఆస్థివద్దు, ఎకౌంటూవద్దు.

రాణి : ఏపుస్తకంలోది బావా యిదంతా? అయినా "నాతోవస్తావా?" ఏంప్రశ్న బావా యిది? ఎద్దును అడిగి గంతకడతావా? నీది నీదని నీకే నమ్మకం లేనప్పుడు నన్నెలా తీసుకువెడతావ్?

గిరి : రాణీ. నీవునాదానివి. [రెండుబుజాలమీద చేతులువేశాడు] కాదన్న మాదన్న ఎవడన్నావుంటే వేమన్న ఏమన్నాడో వినమంటాను.

రాణి : మా నాన్న ఏమన్నాఅంటే?

గిరి : అంటే! కాదన్నా మేనల్లుడ్ని, ఔనన్నా అల్లుడ్ని అంటూ. ఆస్థిఅంతా ఒక్కసారి అడుగుతా!

రాణి : ఆస్థిలేకుంటే నన్నెలా తీసుకెడతావంట ?

గిరి : అంత అసమర్థుణ్ణా ?

రాణి : కాకపోతే ఆకలి, ఆకలి అంటూ వారంరోజులకే ఎందుకు తిరిగివచ్చావ్ ?

గిరి : నీకెలా తెలిసింది ?

రాణి : నాకు అన్నీ తెలుసు.

గిరి : తెలుసా ?

ముత్యా : (వీధిలోంచి వస్తూనే) తెలిసింది. అమ్మాయ్ తెలిసింది. నీవు వచ్చావని తెలిసింది. చూచిపోదామని చక్కావచ్చాను.

రాణి : (ఉత్తరం చూపించింది) ఇటువంటి దొంగఉత్తరాలు వ్రాయడం ఎప్పటినుంచి ? వయస్సు పెరిగేకొద్దీ బుద్ధులు పెడత్రోవను పడుతున్నాయా ?

ముత్యా : నేను వ్రాశానా ?

రాణి : ఆకాశరామన్న వ్రాశాడు. మీ ఉత్తరం మీరు పట్టుకు వెళ్లండి.

(ఉత్తరం యిచ్చేసి లోనికి వెళ్లిపోయింది.)

ముత్యా : (ఉత్తరం తీసుకొని) ఏమిటిది గిరీ ?

గిరి : మావయ్యకూడా ఆలాగే అన్నాడు.

ముత్యా : పసికట్టేశాడన్నమాట.

గిరి : అయితే మీరే వ్రాశారన్నమాట.

ముత్యా : వ్రాశాను. ఎంతో ఆలోచించి వ్రాశాను. రాణి యింట్లోంచి పారిపోయిందని తెలిసి యీ ఎత్తుగడ ఎత్తేను. రాణీకి పెళ్లి అయిపోయిందీ అంటే, నా కూతుర్ని పెళ్లిచేసుకుంటాడు ఆపెద్దమనిషి అను కున్నాను.

గిరి : మీగొడవ మీదేకాని నాసంగతి చూడరేం ?

ముత్యా : డబ్బువిషయం అడిగావా ?

గిరి : అడిగాను.

ముత్యా : ఏమన్నాడు ?

గిరి : ప్రళయం అంతపని చేశాడు.

ముత్యా : మరి రాణి ఏమంది ?

గిరి : తండ్రికితగ్గ కూతురు.

ముత్యా : నిన్ను ప్రేమించినపిల్ల ఆలా ఎందుకంది ?

గిరి : నన్నడుగుతావేమిటయ్యా ! నాకు మతిలేక చస్తూ వుంటే.

ముత్యా : నన్నేం చెయ్యమంటావ్ ?

గిరి : ఏదైనా సలహా చెప్పవయ్యా. ముసలితలకాయ్.

ముత్యా : ఇంతలావున్నావ్ తేలుమంత్రం తెలియదూ ?

గిరి : యీవారం రోజులనుంచీ నాతల పగిలిపోతూవుంది.

ముత్యా : అయితే నేనుచెప్పినట్టు వింటావా ?

గిరి : వింటానుచెప్పండి. నీవుమగాడివీ నన్నుదక్కించుకో లేవా అని మారాణీకూడా అంటోంది.

ముత్యా : అయితే సరే! నీవు మగాడివే.

గిరి : అవును.

ముత్యా : సరిగావిను. నీకంటె ఏంగొప్పవాడని ఆ పొరుగింటి పెద్దమనిషికి మీరాణీని యిస్తానంటున్నాడు మీ మావయ్య?

గిరి : దండీగా డబ్బుందని.

ముత్యా : డబ్బులేదని నీవు రుజువుచెయ్యి.

గిరి : ఉందిగా?

ముత్యా : ఉన్నాసరే.

గిరి : ఎలాగ?

ముత్యా : ఆలోచించు.

గిరి : (దీర్ఘంగా ఆలోచించాడు) రైటో! దొరికాడు డొంకలో పరాబు. వేశాం కోటలోపాగా. ముత్యాలుగారూ మీ తెలివి అమోఘం.

పురు : (బయటనుంచి జోరుగావచ్చాడు. అందరినీ చూసి ఆగాడు)

గిరి : ఆగిపోయావేం మావయ్యా. పెళ్లికొడుకు రాలేదేం?

ముత్యా : ఎందుకొస్తాడయ్యా!

గిరి : అడుగో! వస్తుంటేనే.

పురు : రండి.

చిదా : (రెండు పూలదండలు తీసుకొని వీధిలోంచివచ్చాడు.)
ఓ రావుగారు! యీ శుభసమయంలో మీరు కూడా యిక్కడవున్నందుకు చాలా thanks........ మిష్టర్ గిరీ నీకుకూడా.

గిరి : Yes. Yes.

ముత్యా : ఈదండలు. అబ్బే ఎందుకా అని.

చిదా : చెప్పండి మావ్ గారూ

పురు : ఆయన మాటలకేంలెండి. మీరు కూర్చోండి. నేను అమ్మాయిని తీసుకొస్తాను.

గిరి : ఎందుకు?

చిదా : సస్పెన్సులో ఉంచకండి విషయాన్ని. వివరించి చెప్పండి.

పురు : ఆలాగే. మన పొరిగింటి పెద్దమనిషికి. యీ చిదానందంగారికి నాకూతురు రాణినియిచ్చి యిక్కడ యిప్పుడే యీ క్షణంలో...

చిదా : వర్జ్యం రాకమునుపే.

పురు : వర్జ్యం రాకమునుపే. పూలదండలపెళ్లి.

చిదా : తదుపరి రిజిష్ట్రారు దగ్గరకెళ్లి Marriage ని రిజిష్టరు చేయిస్తాం.

పురు : అవును.

చిదా : తదుపరి డిన్నర్. రావూజీ. ... మిష్టర్ ... మీ యిద్దరికీ మా వధూవరుల తరఫున యిదే నా ఆహ్వానం. తప్పక మా మేడకుదయచేయండి. మావ్ గారూ వర్జ్యం వచ్చేలాగుంది.

పురు : పిలుస్తాను. అమ్మాయ్ రాణీ (లోపలకు వెళ్లాడు.)

గిరి : ఏమండీ. యింత అర్జంటుగా...

ముత్యా : మరేనండీ.

చిదా : మాటనికరంగా వుండాలండీ. యిందాకేమన్నారు. మీరు విన్నారుగా. (సోఫాలో కూర్చున్నాడు.)

గిరి : (తనగదిదగ్గరకు వెళ్లి, రహస్యంగా పిలిచాడు.) ఏమండీ!

ముత్యా : (దగ్గరకు వెళ్లాడు.)

గిరి : రేపుజరగాల్సిన పెళ్లి యీవేళ పెట్టాడు, ఎందు చేతనంటూరు?

ముత్యా : ఏమో: అది ఆబ్రహ్మాండనాయకుడికే తెలియాలి.

గిరి : కొంపతీసి తొందరపడి పీరుసాహేబు సాయిబుల్లో కలిసిపోయినట్లు ...

చిదా : (సోఫాలోంచి విసురుగాలేచాడు) ఎవరు సాహెబ్? ఏమిటి మీ ఆలోచన?

గిరి : మీకెందుకు కావాలి?

చిదా : నేను యీ ఇంటి అల్లుడిన్ని.

గిరి : నేను మేనల్లుడిన్ని. మీకంటే రెండు అక్షరాలు ఎక్కువ తెలుసా?

చిదా : పిల్లను నాకిచ్చి చేస్తున్నాడు తెలుసా?

గిరి : నీకుకాదు. నీడబ్బుకి.

ముత్యా : సరైనమాట.

చిదా : అల్లాగా. నీ ఉద్యోగం ఊడదీయిస్తాను.

ముత్యా : చాలామందిని చూశాను.

చిదా : అంతవరకూ వచ్చిందా?

గిరి : పేచీపెట్టుకోకండి ఆయనచిన్నప్పుడు మావూరిలో కల్లా పెద్ద రౌడీ.

చిదా : బొత్తిగా సంస్కృతి లేనివాళ్లతో నాకేమిటి?

ముత్యా : నాకు సంస్కృతంవచ్చు. మీకురాదేమో?

గిరి : నిజం. అక్షరాలా నిజం.

చిదా : మీలాంటి మూర్ఖులతో నాకనవసరం.

గిరి : అందుకే రేపు పెళ్లిముహూర్తం పెట్టుకొని యీ వేళ పూలదండల పెళ్లి.

చిదా : చిన్నబుర్రలుమీవి. నాప్లాను మీకెలా అర్థమవుతుంది?

ముత్యా : చెప్పండి. పోనీ వింటాం.

గిరి : అసలు వుంటేగా చెప్పటానికి.

చిదా : కావలసినంతవుంది. పురుషోత్తంగారేమన్నారు? తనకూతురు నాకంటె డబ్బున్నవాణ్ణి చేసుకుందని యిందాక అనలేదూ? ఆలస్యం అమృతం విషం అన్నారు.

గిరి : అందుకని యిప్పుడే పూలదండల పెళ్లి చేసుకొంటున్నారా?

చిదా : యిప్పుడు మీబుర్ర పనిచేస్తోంది.

ముత్యా : కాని మీరు మహా శోకాతింటున్నారు.

చిదా : ఏమిటి?

ముత్యా : నూరు అబద్ధాలాడైనా ఒకపెళ్లి చెయ్యమన్నారు!

అటువంటప్పుడు నేను అసలువిషయం చెబితే...
బాబు... నేను చెప్పను.

గిరి : పోనీలెద్దురూ పాపం. పెద్దమనిషి. చెప్పండి.

ముత్యా : పురుషోత్తంగారి దగ్గర ఏమీలేదు.

చిదా : అంటే!

ముత్యా : డబ్బు.

గిరి : నిజంగా!

ముత్యా : మీమీద ఒట్టు. పైన పటారం. లోపల లొటారం. బాల్యస్నేహితుణ్ణి చెప్తున్నాను. నమ్మండి.

గిరి : నమ్ముతారు. ఎందుకు నమ్మరు? అందులోనూ మీరే స్వయంగా చెపుతూంటే.

చిదా : (నవ్వాడు.) నేనేమీ అమాయకుణ్ణి కాదు. పురుషోత్తంగారిదగ్గర డబ్బులేదంటే లేచి చక్కాపోతానని. నీఎత్తు నాదగ్గరపారదు. ఆయన ఆస్థి వివరం నాకు బాగా తెలుసు.

గిరి : అయితే మీరు మా మావయ్యను డోకాతిని పిస్తున్నారు.

చిదా : నేనా?

గిరి : అవును. సమయం వచ్చినప్పుడు చెబుతాను. మావయ్యా! మావయ్యా! వర్జ్యం వస్తోంది. మీరు కూర్చోండి.

చిదా : (కూర్చున్నాడు.)

గిరి : దండలు జాగ్రత్త. బట్టలు జాగ్రత్త. చిదానందంగారు మీకు యిప్పుడు ఒకవిషాదవార్త చెప్పబోతున్నాను.

ముత్యా : యీ శుభసమయంలో ఎందుకులెండి.

గిరి : తెలిసి చెప్పక పోవటం శుద్ధపాపం.

చిదా : (గుమ్మం వద్దకు వెళ్లాడు.) వర్షం వస్తోంది ఉత్తమ్‌జీ.

గిరి : పాపం ఏంచేస్తాం. సర్వోదయా బ్యాంకు దివాళా తీసిందట.

చిదా : (గిరిమాటలు వినిపించుకోలేదు.) ఉత్తమ్ జీ ఆలస్యం అవుతోంది.

గిరి : అయితే మీకు బ్యాంకులో డబ్బులేదన్నమాట. ముత్యాలుగారూ. చూశారా! చిదానందగారు మా మావయ్యను డోకా తినిపిస్తారా?

పురు
రాణి } (లోపలినుంచి వచ్చారు.)

చిదా : ఏమిటి నువ్వనేది?

గిరి : మీకు బ్యాంకులో డబ్బుందా?

చిదా : ఉంది.

ముత్యా : సర్వోదయా బ్యాంకులో?

చిదా : ఆఁ.

పురు : ఏమిట్రా ఆ యక్షప్రశ్నలు?

గిరి : నీవుండుమావయ్యా! సర్వోదయాబ్యాంకు దివాళా తీసింది.

చిదా : ఆఁ. తీసిందా ?

గిరి : తీసింది. దవాళా తీసింది.

ముత్యా : సర్వోదయా బ్యాంకు దివాళా.

చిదా : తీసిందా ! న్నా రెండులక్షలు... (కూలిపోయాడు.)

ముత్యా : చచ్చిపోయాడు. హార్టు ఫెయిల్ అయ్యింది.

గిరి : వర్జ్యంవస్తోందిసాయంపట్టండి. బయటకులాగేద్దాం.
(చిదానందాన్ని గిరి, ముత్యాలు సాయంపడుతున్నారు.)

రాణి : నాన్నా ! చచ్చిపోయాడు !

పురు : ఇదంతా నాకేమిటో అర్థంకావటంలేదు.

ముత్యా : అర్థంతరంగా చచ్చిపోయాడు. పాపం నూకలు చెల్లిపోయాయి.

గిరి : మరీ అర్జంటుగా చచ్చాడండీ!

పురు : యింతకీ అమ్మాయ్ !

చిదా : ఏమిటి ? వదలండి.

ముత్యా : మాట్లాడక వూరుకో.

గిరి : నువ్వు చచ్చిపోయావ్.

చిదా : నేను బ్రతికే వున్నాను.

రాణి : (వచ్చె నవ్వు ఆపుచేసుకొంటోంది.)

పురు : వదలండి. వదులు గిరీ (వీపుమీద వేశాడు.)

గిరి : (వదిలేశాడు.) బాబోయ్ పాతదెబ్బ.

ముత్యా : (వదిలేశాడు)

చిదా : (క్రిందపడ్డాడు. లేచాడు.) నన్ను యీలా అగౌర్వపరుస్తారా ?

పురు : క్షమించండి. గిరీ ఏమిటి నీ అల్లరి ?

గిరి : చచ్చిపోయాడను కున్నాను.

ముత్యా : అవునండీ. అందుక నే.

చిదా : ఆపవయ్యా.

ముత్యా : మీరెంత గొప్పవారైనా ఆలా అగౌరవంగా మాట్లాడటం మంచిదికాదు.

గిరి : ఆయన చిన్నప్పుడు పెద్ద ౼ ౼డీ.

పురు : గిరీ !

చిదా : ఎంతో టైంలేదు. వర్జ్యం వచ్చేస్తోంది.

పురు : అమ్మాయ్. దండతీసుకో. (క్రిందపడ్డ రెండుదండలు చెరొకటి అందించాడు.)

రాణి : (తీసుకుంది.)

చిదా : (తీసుకొని తయారయ్యాడు.)

గిరి : ఆగండి.

రాణి : మళ్లీ ఏమొచ్చింది బావా ?

గిరి : బ్యాంకు దివాళాతీసింది. యిప్పుడు యీాయన బికారి.

చిదా : బ్యాంకు దివాళాతీస్తే నేనుబికారినెలా అవుతాను? యిది నిజమని ఆధారమేమిటి ?

గిరి : ఆధారం... (ముత్యాలువైపు చూశాడు.)

ముత్యా : ఆధారం... అందరూ అనుకోవడమే.

చిదా : నేను నమ్మను.

గిరి : మా మావయ్య పిల్లనివ్వడని

చిదా : కాదు. ఒకవేళ అయినా యిక్కడవున్న మేడ, కట్టబోతున్న ఫ్యాక్టరీ, ఆర్డరుయిచ్చిన మిషనరీ, బోదన్‌లో భూములు యింకా ఇంపోర్టు అండ్ ఎక్స్‌పోర్టు బిజినెస్ ఇవన్నీ పోతాయా? ఏమండీ ఉత్తమ్‌జీ మీరేమంటారు?

గిరి : మా మావయ్య చస్తే నమ్మడు.

పురు : ఒరేయ్! నీ అల్లరి ఆపుచేయ్. పిచ్చివెధవ.

చిదా : వర్జ్యం వస్తోంది.

పురు : కానియ్ అమ్మా!

గిరి : ఆగండి.

రాణి : మళ్లీ ఏమొచ్చింది బావా?

గిరి : ఏమండోయ్. మీసంగతి మారాణీకి మావయ్యకు చెప్పేశాను. యిప్పుడు మారాణీసంగతి మీకు చెప్తాను.

పురు : ఏమిట్రా వెధవ.

గిరి : నీవెన్నితిట్టు, ఎన్నికొట్టు ఉన్నది వున్నట్టు చెప్పుతాను. జరిగింది జరిగినట్టు చెప్పుతాను. ఏమండీ ముత్యాలుగారూ ఏమంటారు?

ముత్యా : చేసిన పాపం చెప్పితే పోతుందంటారు. చెప్పండి.

గిరి : మారాణీనేను ప్రేమించుకొన్నాం. పెళ్లిచేసుకోవాలనుకొన్నాం. మీకు డబ్బుందని...

ముత్యా : కాదు దర్జాకూడా వుందని.

గిరి : ఉందని, నాకు చేయకుండా మా రాణీని మీకిచ్చి...

పురు : నా యిష్టం నే చేస్తాను.

చిదా : నే చేసుకొంటాను.

గిరి : మా రాణీ చేసుకోదు.

పురు : ఒరేయ్ గిరీ!... వాడిమాట పట్టించుకోకండి. చెప్పమ్మా వాడిమాట కాదని చెప్పు.

రాణి : నీ యిష్టమే నా యిష్టం నాన్నా.

పురు : శహబాష్ నా కూతురువి.

చిదా : మరింకేం? కానివ్వండి. వర్జ్యం వస్తోంది.

పురు : ఆలస్యమవుతోంది. దండలు వేసుకోండి.

గిరి : ఆగండి.

చిదా : ఏమిటి యీ పిల్లసమేరం?

గిరి : కాదయ్యా. మా రాణీ ఏడుపువ్వులు అంటె ఎడే మల్లెపువ్వులు తూగదు. తెలుసా?

చిదా : అంటె?

గిరి : మా మావయ్య తాతయ్య అవ్వబోతున్నాడు.

ముత్యా : అంటె గర్భిణి అన్నమాట.

పురు : వట్టిది. పచ్చి అబద్ధం. నాకూతుర్ని ఇలా ఆడి పోసుకుంటారా? ముత్యాలూ నీకూ ఆడపిల్ల వుంది. ఎంతమాట అన్నావ్. ఒరేయ్ గిరి తిన్న ఇంటి వాసాలు లెఖ్ఖపెడతావా? చవటా (కొట్టబోయాడు)

రాణి : ఆగండి నాన్నా. చిదానందంగారూ మాశాన అన్నది నిజంకాదు. తన్ను చేసుకోవటంలేదని అంటున్నాడు.

చిదా : అయితే సరే.

గిరి : ముత్యాలుగారూ.

పురు : మీరిద్దరూ బయటకు వెళ్లండి. ఊఁ. వెళ్లండి.

రాణి : ఉండనీ నాన్నా. మా పెళ్లికి ఎవ్వరూ రాకపోయినా యిద్దరైనా సాక్షులుంటారు.

చిదా : వర్జ్యం...—

పురు : అమ్మాయి.

చిదా : (చొరవగా దండ వేయబోయాడు.)

రాణి : ఆగండి.

చిదా : ఏం?

రాణి : మిమ్మల్ని ఒకమాట అడగాలి.

పురు : తరువాత అడగొచ్చు. ముందు కానివ్వండి.

రాణి : అలాకాదు నాన్నా.

చిదా : అడగనివ్వండి.

రాణి : మీ రెవ్వరో, మీ పుట్టుపూర్వోత్తరాలు ఏమిటో మీ ఆచార వ్యవహారా లేమిటో నాకేమీ తెలియవుకదా? మీరు మీవివరాలు చెబితే నేను నా వివరాలు చెపుతాను.

ముత్యా : బాగుంది. పెళ్లికిముందు ఒకరిగురించి ఒకరికి తెలియటం చాలా మంచిది.

గిరి : మంచిదంటారా? ముత్యాలుగారూ.

పురు : నువ్వుండరా. సరే మీరు కానివ్వండి.

చిదా : అటు జర్మనీకి హిట్లర్ నియంత అయ్యాడు. ఇటు నేను పుట్టాను.

గిరి : మారాణీ ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామంలో పుట్టింది.

పురు : ఒరే గిరీ. వాళ్ల వ్యవహారం వాళ్లని చూసుకోనీ.

రాణి : బావకు అన్నీ తెలుసుకదా నాన్నా. చెప్పనీ.

ముత్యా : కానివ్వండి. మళ్లీ వర్జ్యం వస్తోంది.

చిదా : నేను చిన్నప్పుడు ప్రతీది పరిశీలనాదృష్టితో తిలకించే వాడినట.

రాణి : నేను...

ముత్యా : చాలా అల్లరి చేసేదానివి.

పురు : (కోపంగా చూశాడు.)

రాణి : అవును చాలా అల్లరిచేసేదాన్ని.

చిదా : స్కూల్లో నాకు ఫస్టుమార్కులొచ్చేవి.

గిరి : నేను ఒకోక్లాసులోనూ రెండేసి సంవత్సరాలు...

పురు : గిరీ!

ముత్యా : పురుషోత్తంగారూ గిరికి ప్రవేటుమేష్టారినికూడా పెట్టాం అప్పుడు. అయినా ప్రతిసంవత్సరం డింకీ కొట్టేవాడు.

పురు : ముత్యాలూ నువ్వు వూరుకుంటావా లేదా?

ముత్యా : ముత్యాలు. ఊఁ. ఉన్నమాట అంటే వులుకెక్కువ. నాకెందుకు నేనువూరుకుంటాను. మీరెగోడవమీరు పడండి. మధ్య నాదేముంది ?

పురు : అబ్బ ! బ్బ బ్బ ! ఊరుకుంటావా లేదా ? వర్జ్యం వస్తోంది. తొందరగా కానివ్వండి.

చిదా : ఉఁ! మానాన్నగారు చనిపోవటంతోనే ఏకాకి నైపోయాను. కుటుంబ బాధ్యత మీదపడింది. అంతే చదువుకు స్వస్తిచెప్పాను. వ్యాపారాన్ని ఆరు పువ్వులు, మూడు కాయలుగా ఆనాటినుంచీ నేటివరకూ అభివృద్ధిచేశాను.

గిరి : బ్యాంకు దివాళా !

ముత్యా : అవును దివాళా.

గిరి : దివాళా.

ముత్యా : బ్యాంకు దివాళా.

గిరి : బ్యాంకు దివాళా.

పురు : ఒరే గిరీ ( కొట్టబోయాడు. )

గిరి : ( తప్పుకున్నాడు. )

పురు : ముత్యాలూ... కానివ్వండి.

రాణి : ఏమండీ చిదానందంగారు ఒక్కవిషయం అడగ మంటారా ?

చిదా : అడగండి. అరక్షణంలోతీరుస్తాను. ఎటువంటిదైనా సరే ! Don't Delay.

రాణి : మీరు... వెంకాయమ్మగార్ని ఎరుగుదురా ?
చిదా : వెంకాయమ్మ. చాలా Wonderfull Name!
రాణి : Most Beautiful చెప్పండి. వెంకాయమ్మ.
చిదా : తెలియదు.
రాణి : ఆలోచించండి.
చిదా : రిమెంబరెన్స్‌కె రావటంలేదు. కనీసంకలలోకూడా చూసివుంటాననే నమ్మకం నాకులేదు.
రాణి : కలలో ఎందుకు చూడాలి. జీవితంలోనేచూచారు. పెళ్లి చేసుకున్నారు.
చిదా : నేనా ? పెళ్లి చేసుకోవటమా ? అప్సర్డ్ !
ముత్యా : అదేమిటయ్యా. అమ్మాయి చెప్పతూవుంటే
గిరి : ఆయనకి వినిపించటంలేదు.
పురు : అమ్మాయి ఏమిటిది ? నిజమేనా ?
రాణి : నిజం నాన్నా !
చిదా : అబద్ధం పచ్చిఅబద్ధం.
రాణి : పచ్చినిజం.
చిదా : ఏమండీ ఉత్తమ్‌జీ చూసారా ? ముగ్గురుకలసి నాటకం ఆడుతున్నారు. మీరు చూస్తూ ఊరుకుంటారేం ? నామాటమీద నమ్మకంలేదా ? చెప్పండి. మీరు కావాలని కోరికన్యనిస్తానంటే కాదనకుండా వచ్చాను. చెప్పండి ఇష్టంలేకపోతే.
పురు : మీరు కంగారు పడకండి. అమ్మాయి...

రాణి : నాన్నా. ఈయనకు ఇంతక్రితమే పెళ్లి అయ్యింది. ఆవిడ పేరే వెంకాయమ్మ. ఆవిడ బ్రతికేవుంది. పిల్లలుకూడా వున్నారు.

ముత్యా : వెంకాయమ్మ అనే ఆవిడ ఈయన ధర్మపత్ని అన్నమాట.

గిరి : అన్నమాట ఏమిటి ? ఉన్నమాటే ! రాణీ చెప్తోందిగా !

చిదా : చూశారా? గూడుపుఠాణీ. కూడబల్కుకొని నన్ను ఫూల్‌ని చేద్దామనుకుంటున్నారు. ఏమండీ మావ గారూ! కళ్యాణం జరిపిస్తారా ? లేదా ? కాలు ఈయింటిలోంచి బయటపెట్టానంటేచస్తే తిరిగిరాను

గిరి : రానక్కరలేదు.

రాణి : దయచేయ్యండి.

ముత్యా : ఇంకాచూస్తారేం కదలండి. అమ్మాయి చెప్పిందిగా?

గిరి : సిగ్గు బిడియం వుంటేగా ?

పురు : నోర్ముయ్. మీరుయిద్దరు నాకు శనిలా దాపురించారు. మీరు ఏడవ్వండి. మొత్తుకోండి. నా కూతుర్ని చిదానందంగారికే యిచ్చి పెళ్లిచేస్తాను. కాదంటే మీ రక్తాన్ని కళ్లచూస్తాను.

రాణి : నాన్నా !

ముత్యా : అన్యాయం.

గిరి : ఘోరం.

పురు : నోరు ముయ్యండి. అమ్మాయి వాళ్లమాటవిని వాళ్లతో కలిసి, ఆయనమీద నిందలువేస్తావా?

రాణి : నిందలుకావు! నేను చెప్పినవి నిజాలునాన్నా!

చిదా : ఉత్తమ్‌జీ వర్జ్యం వస్తోంది.

రాణి : వస్తే రానివ్వండి. నేను మిమ్మల్ని చేసుకోను. (దండ పడవైచి తనగదిలోకి వెళ్లిపోతోంది.)

పురు : ఆగు. అమ్మాయి ఇలారా (చెయ్యిపట్టుకొని ఆపాడు) వాళ్లమాటవిని అల్లరిపాలు కాకు. దండతీసుకో (బలవంతంగా చేతిలోపెట్టి) వేసుకోండి. వెయ్యండి చిదానందంగారు.

రాణి : నాన్నా! నాన్నా (పెనుగులాడింది.)

చిదా : (దండ వేయబోయాడు.)

రాణి : నాన్నా (జాకెట్ లోంచి ఫోటోతీసియిస్తూ) ఈ ఫోటో చూడునాన్నా. ఈయన—ఈయన భార్య వెంకాయమ్మ పిల్లలు.

(ముత్యాలరావు, గిరి ఆఫోటోను అందుకొని తాముకూడా చూస్తారు.)

ముత్యా : అమ్మాయి ఈ సంగతి నీకెలా తెలిసింది?

రాణి : తెలుసుకుంటే తెలుస్తుంది. తెల్లనివన్నీ పాలు అనుకుంటే ఎలా? ఈయనవి అని మీరు తలపోస్తున్న ఆస్థి పాస్తులు ఈయనవికావు. అవికల ఆ సామీ వేరే వున్నాడు. అక్కడ ఈయన కేవలం ఒక వుద్యోగి మాత్రమే.

పురు : చిదానందంగారు మాట్లాడరేం ?

గిరి : ఇంకేం మాట్లాడుతాడు చిత్తైపోతే.

ముత్యా : ఏదో గొప్పవాడివని నాకూతురు గొంతుకోద్దును. ముఖ్యంగా అదృష్టవంతుడిన్ని.

చిదా : ( బయటకు వెళ్లబోయాడు. )

పురు : ఆగు దుర్మార్గుడా ! ఇంతద్రోహంచేస్తావా ? పెద్ద మనిషిగా నాటకమాడి నాకొంప కూలుద్దామను కొన్నావా ? అల్లారు ముద్దుగా పెంచి, నీలాంటి నీచుడిచేతిలోపెట్టి దాని గొంతుకోద్దును. నీ డాబు దర్పంచూసి నిజమని భ్రమించాను. మేకవన్నె పులివనుకోలేదు. ద్రోహి!

చిదా : నేను ద్రోహినికాదు. మీరే నన్నిలా తయారు చేశారు. యీమేడ ఫ్యాక్టరీచూసి, ఆవన్నీ నావేఅనుకొని, నన్నుఆకాశానికి ఎత్తేశారు. నాకు లేనిపోనిగొప్పలు అపాదించి. నన్నుఇంద్రుడు, చంద్రుడు అనిపొగిడారు. మీపద్ధతికి తగ్గట్టుగానే నేనూనటించాను. మీతాహతు కుమించినఅల్లుడిన్ని మీరు తేవాలనిచూశారు. మీలోమీరుపోటీపడి, పిల్లనిస్తానని వచ్చారు. మీకైతే డబ్బున్నవాడు అల్లుడుగా రావాలా ! నాకు డబ్బుతో పెళ్లాం వస్తుంటే చేదా ? కుటుంబభారంతో నలిగిపోయాను. నేనుజీవితంలో ఏమీ సుఖపడలేదు. ఆశ పెట్టారు. పేరాశలోపడ్డాను. సుఖపడాలను కోవటంతప్పా ? చెప్పండి. ఇక్కడికివచ్చి తుఫానులేపాను. పరిశాంత వాతా

వరణాన్ని కలుషితంచేశాను. క్షమించండి.

( వెళ్లిపోతూ గిరికి దండయిచ్చి వెళ్లిపోయాడు. )

ముత్యా : పాపం... వర్జ్యం వస్తోంది మరి.

గిరి : మావయ్యా నాడబ్బు నాకుపడేయ్ యీకొంపలో ఒక్కక్షణంవుండను. నేను వెళ్లిపోతాను.

పురు : ఒరేయ్ గిరీ. పొరపాటయ్యిందిరా.

గిరి : అలా వీల్లేదు. నాడబ్బు నాకు పారేయ్.

పురు : యీ ఆస్థిఅంతా నీది, అమ్మాయిది కాకపోతే యింకెవరిదిరా ?

రాణి : బావా ! నువ్వులేకుండా నాపెళ్లి జరగదన్నానుగా

ముత్యా : అయితే అమ్మాయి ఆతనివిషయం అంతా నీకెలా తెలిసింది ?

రాణి : ఆ లేడీ టైపిస్టు చెప్పింది.

పురు : దేవతలా అడ్డుపడింది.

ముత్యా : వర్జ్యం వస్తోంది.

గిరి : ఆఁ. వచ్చింది పోయింది.

పురు : ఆ. మరి కానివ్వండి.

( గిరి, రాణి దండలు వేసుకొన్నారు. )

ముత్యా : శీఘ్రమేవ సుపుత్రప్రాప్తిరస్తు. పురుషోత్తంగారూ దీవించండి ఆలోచిస్తారేం ? నమస్కరించండి.

( యిద్దరూ నమస్కరిస్తున్నారు, పురుషోత్తం యిద్దరినీ దగ్గరకు తీసుకున్నాడు. )

... తెర ...